# కావ్య మంజరి



రచయిత: వేటూరి ప్రభాకరశాస్త్రి

ప్రచురణ
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి
2008

# కావ్యమంజరి

సాధారణసంపాదకులు

**బి.యస్. రెడ్డి (భూమన్)**

సంచాలకులు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయపీఠం

మరియు "శ్వేత" తి.తి.దే. తిరుపతి




శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి

**ప్రచురణ**

**కార్యనిర్వహణాధికారి**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.**

**2008**

**KAVYAMANJARI**

(Pradhama Bhagamu)

By
Sri Veturi Prabhakhara Sastri.

T.T.D. Religious Publications Series No: 788



2008
Copies : 1000

Published by
K.V. RAMANACHARY, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati -517 501

D.T.P. "SVETA" T.T.D., Tirupati.

Printed at
T.T.D.Press.
Tirupati.

ఓం నమోవేంకటేశాయ

# నా మాట

**కె.వి. రమణాచారి,** ఐ.ఏ.ఎస్., తిరుపతి.
కార్యనిర్వహణాధికారి, 23-08-2008
తి.తి.దేవస్థానములు,
తిరుపతి.

శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రజ్ఞాప్రభాకరులు. విమర్శకశిరోమణి. నిత్యపరిశోధకులు. అవధానవిద్యలో ఆరితేరినవారు. శాసన తాళపత్రాల సేకరణ, పరిశీలన, పరిశోధనలలో అందెవేసినచేయి. ప్రాచీన సాహిత్యంపై వారు గావించిన పరిశోధనలు, పీఠికలు, వ్యాసాలు, వ్యాఖ్యలు సాహితీ ప్రియులకు ఆలోచనామృతాన్ని పంచిపెట్టాయి.

తి.తి. దేవస్థానానికి శ్రీశాస్త్రిగారు ఎన్నోవిధాలైన సేవలందించారు. ముఖ్యంగా అనేకవిగ్రహాలూ, శాసనఫలకాలూ శ్రమించి, తెచ్చి, ఒక మ్యూజియంను నెలకొల్పడంలో వారికృషి అగణ్యం! అట్లే అన్నమయ్య సాహితిని పరిశీలించడం, అన్నమయ్యచరిత్రకు విపులపీఠిక సంతరించడం- అందులో అనేకసత్యాంశాలను వెల్లడించడం, శాస్త్రిగారి పరిశోధనదక్షతకు నిదర్శనం.

పరిశోధనలకు తోడూ కవితావైభవంలోనూ వారు సహృదయులను మెప్పించినారు. పాండిత్యం, కవిత్యం, పరిశోధన, యోగం- నాల్గూ ఒకచోట మేళవించిన గొప్పవ్యక్తి - వేటూరి.

ప్రస్తుతం శాస్త్రిగారి 58వ వర్థంతి సందర్భంగా వారి ఖండకావ్యాలు- "కడుపుతీపు, విశ్వాసము, దివ్యదర్శనము, కపోతకథ, మూన్నాళ్లముచ్చట" అనే ఐదింటిని "కావ్యమంజరి" (ప్రథమభాగం) పేరుతో ముద్రించి, పద్య సాహితీస్నిగ్ధహృదయులకు విందుచేస్తున్నాము.

ఈ ఐదుకావ్యఖండికలూ భిన్నవస్తువులతో రసామృతాన్ని, దివ్యసందేశాన్ని అందిస్తూ, "విశ్వశ్రేయః కావ్యమ్" అనే సూక్తికి పట్టుగొమ్మలై ఉన్నాయి.

కడుపుతీపు- మాతృత్వంలోని ఉన్నతత్యాగానికీ, విశ్వాసం- ఆత్మీయతాగుణౌన్నత్యానికీ, దివ్యదర్శనం- యోగామృతసిద్ధికీ, కపోతకథ- దాంపత్యప్రేమోన్నతికీ, మూన్నాళ్లముచ్చట గృహస్థధర్మనిరతికీ, శీలశుద్ధికీ- నిధానాలై- రసప్లావితాలై, సహృదయ హృదయాహ్లాదిగుణంతో, ఉత్తమ కవితాసౌందర్యంతో విరాజిల్లుతున్నాయి. ఈ కావ్యఖండికా పంచకం- పంచభూతాత్మకమైన ప్రకృతిలోని పంచతత్త్వాలనూ అంతర్గతంగా జీర్ణించుకొన్న- ఉత్తమసాహితీమరకతం.

శ్రీనివాసునికృపాధనంతో క్రమంగా వారిసాహిత్యాన్ని ఆంధ్ర లోకానికి అందించేందుకు కృషిజరుగుతూంది.

పాఠకలోకం ఈ 'కావ్యమంజరి' ని ఆదరిస్తా రనీ, చదివి ఆనందిస్తా రనీ, కావ్యపరమార్థ దివ్యసందేశాన్ని గ్రహిస్తా రనీ ఆశిస్తూ ........

ఈ కృషిలో నిరంతర దీక్షతో పురోగమిస్తున్న అధికారులకు, సిబ్బందికీ, సంబంధితులందరికీ అభినందనలతో .....

సదా శ్రీవారిసేవలో

**కె.వి. రమణాచారి**

# అభినందనం

**భూమన్**
సంచాలకులు
'శ్వేత' తి.తి.దేవస్థానములు
తిరుపతి

శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి
వాఙ్మయపీఠం
23-08-2008

ఆశ్రయం ఉంటేనే పండితులూ, కవులూ రాణిస్తారు. ఉత్తమ పాఠకులూ, శ్రోతలూ ఉన్నప్పుడే రచనలూ, ఉపన్యాసాలూ ఆనంద నిలయాలై, సమాజశ్రేయస్సాధనాలవుతాయి. ఒకప్పుడు ప్రాచీన సాహిత్యంపై మక్కువగల్గిన డాక్టర్లూ, లాయర్లూ, ధనవంతులూ, సంస్థానాలూ - యథాశక్తిగా ప్రోత్సాహమివ్వడంతో - ఆ సాహిత్యం ఆబాలగోపాలాన్ని ఆకర్షించింది. కాలానుగుణంగా వస్తున్న మార్పులు సాహిత్యంలోనూ చోటుచేసుకొని, వివిధ ప్రక్రియలతో ఎన్నో మార్పులకు నెలవు అయ్యింది. అయినా కాలప్రవాహపు వేగానికి, బలానికీ తట్టుకొని, ప్రాచీన సాహిత్యం స్వశక్తితో పురోగమిస్తూనే వుంది.

ఈ పురోగమనంలో శ్రీమాన్ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సాహితీ మూర్తి స్ఫురద్రూపంతో ప్రకాశించే మహాతేజోరాశి. బాలసాహిత్యంనుండి పరమాత్మసాహిత్యంవరకూ శ్రీశాస్త్రిగారు చేపట్టని ప్రక్రియలేదు. వారి సాహిత్యంలో విమర్శలూ, పరిశోధనలూ, వ్యాఖ్యానాలూ, అనువాదాలూ, అనుభవాలూ, వ్యాసాలూ, పరిష్కరణలూ, యోగం, త్యాగం - నవ్యత, భవ్యత, దివ్యత - ఇలా అనేకరత్నాలు లభిస్తాయి.

ప్రస్తుతం వారి భౌతికమూర్తిలేకున్నా, సాహితీమూర్తీ, కీర్తీ - శ్రీవేంకటేశ్వరుని కృపామృతవర్షానికి పాత్ర మయింది. వారి పంట పండింది. ''శ్రీమాన్ వేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయపీఠాన్ని'' తి.తి.దేవస్థానం వారు శ్రీవేంకటేశ్వర కేంద్రగ్రంథాలయం మరియు పరిశోధనాకేంద్రంలో నెలకొల్పి, శ్రీశాస్త్రిగారి బహుముఖ సాహిత్యాన్ని ఆంధ్రలోకానికి అందించేందుకు కృషిచేస్తున్నారు. వారి జయంతులు,

వర్ధంతులు జరపడం, వారిసాహిత్యంపై సదస్సులు నిర్వహించడం, వారి రచనలను యథావకాశంగా పునర్ముద్రించడంవంటి ఉత్తమకార్యక్రమాలు తి.తి.దే. కార్యనిర్వహణాధికారి - సహృదయ శ్రీ కె.వి. రమణాచారిగారి ప్రోత్సాహంతో రూపుదిద్దుకొంటున్నాయి.

ఈ దశలో శ్రీశాస్త్రిగారి కాంస్యవిగ్రహస్థాపన జరిగింది. పుస్తకముద్రణ జరుగుతూంది. ప్రస్తుతం శాస్త్రిగారి 58వ వర్ధంతి సందర్భంగా, వారి స్వతంత్ర పద్యకావ్యఖండికలు ఐదింటిని "కావ్యమంజరి" పేర్తో - ప్రచురిస్తున్నాము. ఇందలి కడుపుతీపు - తల్లిప్రేమకూ, పుత్రవాత్సల్యానికీ, విశ్వాసము - ఇద్దరు జీవులమధ్య ఏర్పడిన స్నేహాభిమానాల ఔన్నత్యానికీ, దివ్యదర్శనము - ఉత్తమయోగఫలానికీ, కపోతకథ - త్యాగానికీ, మూన్నాళ్లముచ్చట - క్షణికావేశప్రేమ ఎంతటి అవినీతికీ, అనర్థానికీ దారితీసి, గృహస్థధర్మాన్ని ఎలా తప్పుదారి పట్టిస్తుందో నిరూపించి - పవిత్ర గృహస్థధర్మపరిరక్షణావశ్యకతను ప్రకాశింపజేయడానికీ - అన్నీకలిసి మానవజీవితానికి గొప్పపారమార్థికసందేశాన్ని అందించడంలో సార్థకమయ్యాయి.

ఈ ఖండికలు చదివితే వేటూరివారిలో నెలకొన్న రెండు మూర్తులూ- యోగ, కవితాయోగ - సంపదలతో ప్రకాశిస్తూ సాక్షాత్కరిస్తాయి.

ఈ కావ్యమంజరి పాఠకహస్తాలను అలంకరించి, ఉత్తమభావ సువాసనలను వెదజల్లి, ఆనందాన్ని చేకూరుస్తుం దని ఆశిస్తూ .............

**భూమన్**

# విషయ సూచిక


| | |
|---|---|
| నామాట | iii |
| అభినందనం | v |
| పీఠిక | viii |
| కడుపుతీపు | 1 - 26 |
| విశ్వాసము | 27 - 37 |
| దివ్యదర్శనము | 38 - 60 |
| కపోతకథ | 61 - 85 |
| మూన్నాళ్ల ముచ్చట | 86 -107 |

# మనవి మాటలు

1. స్వార్థరహితంగా శ్రీకార్యపరుల అండదండలలో స్వామిసేవగా భావన చేసే కైంకర్యానికి సర్వజగ ద్రక్షకమైన స్వామి కృపతోడ్పడి ఆశి ంచిన లక్ష్యం అచిరకాలంలోనే అందుబాటులోకి వస్తుం దనడంలో సందేహంలేదు. ఏడాదిక్రితం తి.తి.దేవారు చేపట్టిన శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి వాఙ్మ యం పీఠానికి దైవాను గ్రహం దండిగానే ఉందనడానికి నిదర్శనం ఇప్పటికే అచ్చుపడిన 'ప్రజ్ఞాప్రభాకరము-ఉభయకుశలోపరి', 'తెలుగు మెఱుగులు', 'మీగడతఱకలు','సింహావలోకనము' అనే గ్రంథాలూ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి 120వ జయంతి నందర్భంగా మూర్తిమంతంగా అవిష్కృతమైన వారికాంస్యవిగ్రహమును 29-08-2008లో రానున్న శ్రీశాస్త్రిగారి 58వ వర్ధంతి మహోత్సవాల సందర్భంగా మరికొన్ని గ్రంథాలూ, కార్యక్రమాలు రూపుదిద్దుకొంటున్నాయి.

2. ఈ కృషికి దోహదంగా శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి స్మారక ట్రస్టువారి (1) శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గ్రంథాలయం; (2) మణిమంజరి ప్రచురణలు; (3) మణిమంజరి-వాఙ్మయయోగపరిశోధనపత్రిక విభాగము (4) శ్రీ ప్రభాకర పరిశోధన మండలివారు ప్రోదిచేసి పరిరక్షించిన శాస్త్రిగారి అమూల్యములైన అనేక వ్రాతప్రతులు, నోట్సులు, లేఖలు, లేఖనాలు, డైరీలు, ముద్రితాముద్రిక పరిష్కృత గ్రంథాలు, వ్యాఖ్యానాలు, తలపెట్టిన పరిశోధన ప్రాజెక్టులు, అప్రకటితాలుగను అపరిశీలనాలుగను ఉన్న మరెన్నో శాసన, చరిత్ర, భాషా. వ్యాకరణ, సాహిత్య, యోగవిశేషాలు గల వ్రాతప్రతులు వగైరాలన్నిటిని ట్రస్టువక్షాన తి.తి.దేవారి శ్వేత, కేంద్రగ్రంథాలయం మరియు పరిశోధనాగారంవారికి అందించడం జరిగింది. వాటి పరిరక్షణ, పరిశీలన, విశ్లేషణ, ప్రకటన జరిపి ఆవాఙ్మయ సామగ్రిని లోకానికి అందజేసే ఆలోచన సాగుతున్నది. ఈ సందర్భంగా ఇందుకు కారణభూతులైన పెద్దలందరినీ, ముఖ్యంగా శ్వేత డైరెక్టరు శ్రీభూమన్‌గారిని, వేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయ ప్రాజెక్టు సమన్వయ కర్త పమిడి కాల్వ చెంచుసుబ్బయ్యగారిని కార్యనిర్వహణాధికారి శ్రీమాన్

కె.వి.రమణాచారిగారిని, తి.తి.దే ట్రస్టుబోర్డు చైర్మన్ శ్రీ కరుణాకరరెడ్డి గారిని, ఇతర సభ్యులను, మాన్యులు శ్రీ పి.వి.ఆర్.కె.ప్రసాద్‌గారిని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి స్మారక ట్రస్టువారు ప్రత్యేకించి కృతజ్ఞతతో స్మరిస్తున్నారు.

3. అలభ్యాలుగా నున్న మ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి అమూల్యరచన లన్నిటిని జిజ్ఞాసువులైన పాఠకుల కందుబాటులోకి తేవడం మూలంగా ప్రామాణికమైన వారివాఙ్మయవరివస్యలోని వైశిష్ట్యాన్నీ, వైవిధ్యాన్నీ స్మరించుకొని యువతరం స్ఫూర్తిని పొందడానికి అవకాశం కలుగుతున్నది. సద్యఃఫలితాన్నిచ్చే యీ వినమ్రకృషియే అచిరకాలంలో ఇంకా ముమ్మరంగా సాగి వేటూరివారిసంపూర్ణ గ్రంథావళి ప్రకటన రూపాన సమగ్రసుందరం కాగలదు.

4. ప్రస్తుతం వేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయ పీఠంవారు గతంలో అచ్చుపడి నే దలభ్యంగా ఉన్న శ్రీశాస్త్రిగారి ఖండకావ్యాలైదింటిని పునర్ముద్రిస్తున్నారు. అవే ఈనాడు శ్రీ ప్రభాకర కావ్యమంజరిలో భాగంగా విడుదల కానున్నవి. ఈ ఖండకృతు లైదూ ఒకప్పుడు కావ్యతత్త్వజ్ఞుల నలరించినవి. నే డవి సాహిత్యవిద్యార్థులకును స్ఫూర్తిగా నిలువ గలవు.

5. ఇంతవరకు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి స్మారక ట్రస్టువారు సేకరించగలిగిన శాస్త్రిగారి కవితారచనలు బహువైవిధ్యము గలవి. వాటి నిలా వర్గీకరించవచ్చును. (1) నిబద్ధ రచనలు (మూన్నాళ్లముచ్చట మొదలగునవి); (2) అనిబద్ధములు (కథాగతములు, చాటువులు మొదలుగునవి); (3) ముద్రితములు (అలవాటు మొదలగునవి); (4) అముద్రితములు (నత్రశాల, శంకరశతకం మొదలుగునవి); (5)స్వతంత్రరచనలు (విశ్వాసము మొదలుగునవి); అనువాదములు (ఏణీపంచకం, భజగోవిందం మొదలుగునవి); (6) గేయరచనలు (పూలవిందు, తిరుప్పావై, నవ్రవదులు మొదలుగునవి); (7) ప్రాస్తావికములు (ఎడ్వర్డు పట్టాభిషేకం శ్లోకములు); (8) స్మృతిఖండికలు

(శ్రీనివాస నిర్యాణం, తిరుపతిశాస్త్రినిర్యాణం మొదలగునవి); (9) స్తుతిసుందరములు (పార్థసారధి, శ్రీవేంకటేశ్వరస్వామి మొదలుగునవి); (10) భక్తిభరితములు (శరణార్థి మొదలగునవి); (11) శుభాశంసనములు (నూతన వర్షము మొదలుగునవి); (12) ఆశీర్వచనములు (ముక్త్యాల చల్లపల్లి ప్రభువులను గూర్చి); (13) ఆశుచాటుధారలు (అనేకములు)- కాలక్రమము చొప్పున సేకరించికవి, సేకరించవలసినవి; (14) విమర్శాత్మకములు (సరస్వతి, సీతాఫలము మొదలుగునవి); (15) లేఖాగతములు (చల్లావారికి వ్రాసినవి మొదలుగునవి); (16) వ్యక్తి నిష్ఠములు (గాంధీ, పట్టాభి మొదలుగునవి (17) ఉపదేశాత్మకములు (అలవాటు మొదలుగునవి) - ఇత్యాది వర్గాలలో ప్రభాకర పరిశోధక మండలివారు ఇప్పటివఱకు సేకరించి ప్రోదిచేసినవే అన్నీ వెరసి 60 శీర్షికలకుపైగా ఉన్నవి (వివరాలకు చూ. డా॥ పోచిరాజు శేషగిరిరావు గారి, డా॥ మసన చెన్నప్పగారి MPhil., Ph.D.,థీసిసులు). వీనిలో పెక్కులు లభ్యములైనా మరికొన్ని రచితము లని తెలిసినా దుర్లభములై ఇంకా సేకరింపవలసినవిగానే మిగిలి ఉన్నవి. ఇట్టివేమైనా మదరాసు, కలకత్తా, ఇంగ్లండు ఆర్కైవ్సులో లభించునేమో కనుగోవలసియున్నది. మరికొన్ని అసమగ్రములు (ఆరంభింపబడినా కారణాంతరాలచేత పూర్తికాకనో చేయకనో నిలిచినవి). తెలియరాని వింకెన్ని యున్ననో! వీటిని కూడ సేకరించి సంకలనపరచుటకు మరికొంత పరిశ్రమ మవసరము. శ్రీశాస్త్రిగారి కవితారచనలు-చాటువులు, పాటలు, లేఖలు, ఫోటోలు వగైరాలు తెలుగునాట ఎవరికడనైనా ఉంటే జాగ్రత్త, చేసి, కాపీలు పంపి, సహకరింపు డని వేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయ పీఠంవారు విశదీకరిస్తూ పత్రికా ప్రకటన చేస్తే బాగేమో యోచింపవలెను. ఈ కార్యమంతా పూర్తిచేసి లభ్యమైనంతవరకైనా ప్రభాకరుల సమగ్ర కావ్యమంజరి త్వరలో వెల్లడికావలసియున్నది. అందుకిప్పటినుండే ప్రయత్నింతుముగాకనిమ నవి. శ్రీశాస్త్రిగారివ్రాతప్రతులు, పరిశోధన పరికరములు, ఆకరములు అన్నీ (ఈ సంవత్సరం మే 29-05-2008 - జూలై 19-07-2008)

శ్రీ ప్రభాకర వాఙ్మయ పీఠమువారి కర్పించుటైనది కనుక ఇక పై నిది మన సమష్టి బాధ్యత. ఈ పట్టున నింత వివరణాత్మక విస్తృతికి హేతువు ఇట్టి కృషిలోని లోతుపాతులను స్మరించుకొనుటకే.

6. ప్రస్తుతమీ కావ్యమంజరి పూర్వభాగములో శతావధాని, కవిచూడామణి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారివి అయిదు ఖండకృతు లున్నవి. అన్నీ అర్ఘరత్నములే. సత్యధర్మ సుందరమైన వీరి కవితారచన కల్పనల పొంతకు పోని యథార్థఘటనల కూర్పులే. ప్రామాణికమైన ప్రాచీనప్రయోగదక్షతకు, చవిగల దేశితెలుగు పల్కుబడికి, సరస మనోజ్ఞమైన కావ్యధారకు, భావనలోని ఔచిత్యానికి, రచనా శిల్పానికి వీరి కృతులన్నీ ఉదాహరణలే- కావ్య ప్రయోజనములైన ఆనందోపదేశాలలో ఉపదేశానికే వీరు పెద్దపీట వేస్తారు. "సత్యమైనదే సరసము నైనదే రచన సల్పెదగాక" అన్నదే వారి ప్రతిజ్ఞ.

"పరుషము నిష్ప్రయోజన మబద్ధ మనార్యము చేరరాదునా
విరచనలందు డెందము పవిత్రముగా విలసిల్లి సత్య సుం
దరము పరార్థయుక్తమగు తత్త్వమునే వెలయింపగావలెన్
గురుచరణారవిందములకుం బ్రణమిల్లెద నట్టి నేర్మికై.॥

ఇదే వారి ఉపజ్ఞ. ఇప్పుడు వారి లఘుకృతులకించుక పరిచయము.

7.1. **మూన్నాళ్లముచ్చట**:- 1922లో గ్రంథరూపాన ప్రచురిత మైన యీలఘుకృతి 92 పద్యాలుగల ముచ్చటైన ఉపదేశకావ్యము. శాస్త్రిగారు తొలిపలుకులో చెప్పుకొన్నట్లూ, కావ్యరంభంలోనే ఉద్ఘాటించినట్లూ 'నీతి నిండారంగల్గి(న) యథార్థమైన యొక గాథార్థంబు' (2) "క్రొవ్వుంజవ్వనము గాబ్బైతల, (1) అనుకృత్యారంభపద్యమే ఆధునికతను ఆదర్శాన్ని సంతరించుకొన్నది. 'ఆర్యమర్యాదకుం దవ్వు ల్గాక చరించు నంచితుల' సత్ప్రవృత్తాన్ని చిత్తంతో స్మరిస్తున్నది.

"ఊరుపేరు చెప్పుటొప్ప దేతత్కథా
ధారులయిన తరుణదంపతులకు

నేఁటివారు తెల్గునాఁటవా రదిగాక
వారు గొప్పయింటివారుగాన" (3)

అనుకొనే కథారంభమే ఔచిత్యాన్ని పాటిస్తూ ఉత్కంఠను కల్గిస్తున్నది. కావ్య మాద్యంతమదే పట్టుమీద నడిచింది. ఈ కావ్యకథాకథనంలోని శిల్పం ఆనాడే ఆంధ్ర శేషగిరిరావుగారిచేత ప్రశంసింపబడింది. ఈనాడు 'మంజుశ్రీ డా॥ అక్కిరాజు రమాపతిరావుగారి చేత వచన కథా పరివర్తనానికి ప్రేరణ కల్గించింది. "పసపేమేయన...యీగాథార్థమట్లేకదా" (92) అనే చివరి పద్యం కవితాకథనానికొక కొనమెరుపు. పాఠకులు చదివి ఆనందించగలరనీ; విద్యాధికారులు, విద్యాధికులు ఇలాంటికావ్య ఖండికలను పాఠ్యాంశాలుగా గ్రహించి 'మేలుగాంతు'రనీ, ఆధునిక కవితా సంకలనాలలోనూ సమీక్షలలోనూ ఇట్టి ప్రశస్తరచనలు డా॥ పోచిరాజుగా రన్నట్లు విస్మృతిపాల్గాకుండునుగాకనీ ఆశిద్దాము.

**7.2. దివ్యదర్శనము:-** 1924/25. ఆధునిక కవితాశాఖ లన్నిటిలోకి మేలైన తాత్త్వికకవితాశాఖ కీకృతి ఒజ్జబంతి. 105 పద్యాలలో సాగిన యీలఘుకృతి విజయవాటికలోని కొండమీది దుర్గమ్మ గుడికేంద్రంగా అల్లుకొని వికసించిన ఆధ్యాత్మికలత. అది ఒక తపోభూమి. దుర్గమ్మకొండ చైతన్యానికి ప్రతీక. దుర్గాదేవి స్పందనశక్తి కావ్యమంతా కూడా ఆత్మకథాత్మకంగా విస్మయావహంగా నిర్వాహించెందిన ఆధునిక యోగిపుంగవుని అనుభూతి వికాసగాథ. ఈ తాత్త్వికకవిత చదివిస్తుంది; అలరింపజేస్తుంది; నమ్మందగిన సన్మార్గాన్ని చూపిస్తుంది.

'చక్షుర్గోచరమైనయీ జగతికిం జాటై యనేకాద్భుతప్రేక్షాలక్షిత మెంతయే న్గలదు' అన్న శాస్త్రిగారి అనుభూతికి వ్యాఖ్యానము ఈకృతి.

**7.3. కపోతకథ:-**(1925) 'కవితలో తాత్త్వికాంశములు పెరుగను బెరుగను సంఘమున తాత్త్వికతాశ్రద్ధ పెచ్చుపెరుగును' అన్నారు శాస్త్రిగారు. ఆర్తరక్షణార్థమై ఆత్మత్యాగం చేసేవారి మహోత్కృష్ట ప్రాభవాన్ని చిత్రించే ఇట్టి కథలు, కవితలు ఎట్టి కఱకుగుండెవానిగూడ కరగించి సద్వర్తనుని

కావింపగల సామర్థ్యం గల వని అన్నదే వారి అనుభూతి. ముక్త్యాల ప్రభువులు బ్రహ్మానందోత్సవాలు జరిపించిన సందర్భంలో శ్రీ శాస్త్రిగారే వారికి ప్రేరణ కల్గించి భారతాంతర్గతమైన ఈకపోత వృత్తాంతాన్ని పదిమందికీ వినిపించీ, వ్రాయించీ, చదివించీ ప్రచారానికి తెచ్చే సూచన చేశారు. ఆ సమావేశంలో పాల్గొన్న లబ్ధప్రతిష్ఠులైన కవిపండితులు పలువు రీకవితా స్పర్థలో చేరి నిర్ణీతకాల వ్యవధిలో ఆశురచనగా ఈ కావ్యకథనా విష్కరించారు. ఆనాటి పోటీలో శ్రీపిశుపాటి చిదంబరశాస్త్రిగారి కృతినే మిన్నగా ఎన్నిక చేసి ముక్త్యాల ప్రభువుల చేత సత్కారం జరిపించినారని పెద్దలు చెప్పగా విన్నవార్త. 'ఆత్మార్థం పృథివీం త్యనే'త్తనెడి వాక్యం బేమి వాక్యంబొ అంటూ ప్రాచీన సూక్తిని చప్పరించి 'తాదాత్మ్యత్యాగమునం బరప్రియము సేయుంబూనువారే నుధన్యాత్ముల్ (అజ) అని తీర్మానించారు.

'ఎవ్వడు ధర్మసక్తుడయి యీశ్వరతత్పరుడై స్వయత్నముల్
గవ్వకు గూడమాఱవని కన్గొని యార్తుల రక్షణార్థులన్
నెవ్వగనుండి కావ దననేర్పును భాగ్యము వెచ్చపెట్టునో
యవ్వరణీయవర్తనున కబ్బెడు నిందును నందు సౌఖ్యముల్' (87)

అన్నదే ఈ కావ్యకథలోని పరమార్థము. బ్రహ్మానందోత్సవాలలోని కవితాస్పర్థకు ప్రభాకర శాస్త్రిగారే న్యాయనిర్ణేతగా వ్యవహరించారు గనుక తమ కావ్యాన్ని ఆస్పర్థలో భాగంగా పరిగణించలేదు. అప్పుడు అందరితో పాటు తాము మూడుంపుటలలో ముగించిన కృతియేు ఈ కపోతకథ-'వినదగినది', 'మననము చేయనుదగినది.'-

7.4.**కడుపుతీపు**:-(1925) ఆంధ్రత్వానికీ, ఆంధ్రదేశభాషాభిమానానికీ, ఆంధ్రకవితామాధుర్యానికీ, కరుణారసనిర్వాహానికీ, కథాకథన కౌశలానికీ, అవధులులేని మాతృప్రేమకూ, ప్రేమసిక్తమైన కృషి తత్త్వానికీ (105) కడుపుతీపు ఖండకావ్యమొక విశిష్టోదాహరణము. వింటేనే కడుపు తరుక్కుపోయే ఈ వాస్తవ సంఘటనను తమ మిత్రుడైన శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు చెప్పగ విని 'మనసునీరై యిట్టి కృతిగా కూరిచినాద

నని చెప్పుకొన్నారు కవి. శర్మగారు చెప్పిన కథ వాస్తవంగా ఆనాడు తెలుగునాట జరిగినదేననీ, ఆవార్త నాటివార్తాపత్రికలలోనూ ప్రకటితమైనదనీ స్వయంగా ఎరిగిన పెద్దల్లో ఒకరు నా కీమధ్యనే తెలిపినారు. 'కలదుగద యంధ్రవిష్ణుస్థలమై' అన్నకవితాకథనం ఎత్తుగడలోనే ఒడుపులు చూపింది 'అరసియెరుంగ రిందనుక నత్తిలు నత్తలునీమతల్లి కాపురమున కాపురమ్మునకె పోయెను'(3) లాటి కైత కూర్పు ప్రామాణిక పదప్రయోగానికి, ఔచిత్యానికి, శ్రీనాథాదులను తలపించే హృద్యపద్యవిద్యకు ఆధునికకాలాన పాదులు కట్టింది. ఈ కావ్యరచనకు కొంతకాలం మునుపు కృష్ణకు వరదలువచ్చి ఎంతో ధనప్రాణనష్టం జరుగగా స్వయంగా చూచి మనసు వికలమై 'కళ్లేపల్లివరదలు' అనే శీర్షికతో 'ఒకవిలేకరి' అనే ప్రతినామంతో కొన్నివారాల పాటు పత్రికలో శాస్త్రిగారు ధారావాహికంగా కొన్ని వ్యాసాలు వ్రాశారు. అందులో వారి సామాజిక స్పృహ, పరోపకారచింత ఎంతగానో వ్యక్తమైంది. చివరకు ఆవ్యాకంలో "కూలెంగొంపలు ప్రాపుదప్పి పఱచెంగోతండముల్" (10); 'కూకటివ్రేళ్లతో...'(14) అని ఒకటి రెండు పద్యాలు వ్రాశారు. వాటినే శాస్త్రిగారు తరువాతి కాలపు తమ యీ కృతిలో పొందుపరచుకొన్నారు. ఆ వ్యాసకర్త, 'ఒకవిలేకరి' శ్రీప్రభాకరశాస్త్రిగారే అనడానికి వారి భావసంపదతోపాటు ఈ పద్యాలూ సిగ్నేచర్ సాక్ష్యాలాంటివి.

7.5. **విశ్వాసము:-** (1926) అరవైనాలుగు పద్యాలలో (58 గీతాలు, 6కందాలు) గుడివాడ-బందరు రైలుమార్గంలో కరుణ రసప్రధానంగా సాగిన వాస్తవగాథ యిది. ఈ లఘుకృతి చదివిన వారికి, విన్నవారికినిగూడ ఎంత ఆపుకొందామనుకొన్న ఆగని కన్నీరు ధారలైపారడం ఖాయం. ఈ కృతి ఆకృతిలో చిన్నదైనా పాఠకులపై పడేముద్ర మాత్రం దొడ్డది. ఇందులోని పాత్రలు మట్టిపనిచేసే ఉప్పరి, అతనిపై విశ్వాసం వీడలేని ఒక ఊరకుక్క, కథకుడైన కవి తాను, మరోతోడి ప్రయాణీకుడు చౌదరి ఇతరులు. అలతియలతినుడులతో అనల్పార్థాన్ని భావింపజేసే యీకృతి చదువరులను ఊపేస్తుంది. వ్యక్తిత్వ పరిశీలనకు, మనస్తత్వ

చిత్రణకు, ప్రాణిగతసహజవిశ్వాసానికి, కరుణరసప్రధాన కవితానిర్వాహానికి పెట్టింది పేరు 'విశ్వాసం' కృతి. రైలు, ప్లాట్ఫారము, టిక్కెటులాటి తెలుగుదనం సంతరించుకొన్న ఆంగ్లపదాలు, గుడివాడ బందరు రైలుమార్గంలోని స్టేషనుల పేర్లు, సన్నివేశాలు కవితలోని సహజాలం కారాలు. సహృదయవిమర్శకు లొకరన్నట్లు కుక్కగురించి కవిత చెప్పినా సత్యసుందరంగానూ శిల్పమహితంగానూ ఉండా లంటారు. ప్రభాకర శాస్త్రిగారు. ఆ శిల్పమెట్టిదో పాఠకులు గుర్తించగలరు.

ఇవీ శ్రీ ప్రభాకరుల కావ్యమంజరి ప్రథమభాగంలోని కృతులు. తక్కిన నిబద్ధానిబద్ధ, ముద్రితా ముద్రితకావ్య రచన లన్నిటినీ కూర్చుకొన్న ద్వితీయభాగం త్వరలోనే వెలుగు చూడగల దని ఆశిద్దాము.

08-08-2008 సర్వధారిశ్రావణ శుక్రవారం.

**వేటూరి ఆనందమూర్తి**

# తొలిపలుకు

ఈ కృతిలోని 'చీకటివేళ' భూతార్థమును మన్మిత్రులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారొకప్పుడు చెప్పఁగా విని మనసు నీరయి యిట్లు కృతిగాఁ గూరిచినాఁడను. గుణదోషముల గణుతించుటకు సహృదయులే ప్రమాణము.

క్రోధన
(విజయదశమి)

వేటూరి ప్రభాకరశాస్త్రి

## కడుపుతీపు
### తేపటివేళ

కలదుగద యంధ్రవిష్ణు
స్థలమై శ్రీకాకుళాభిధానమ్మునఁ బే
ర్వెలసిన పుర మంధ్రావని
వెలనాటన్ గృష్ణపెంపు వెలసినచోటన్. 1

క. ఆయూర నొక్క యోవర్
సీయరు సకుటుంబముగ వసించుచునుండున్
ప్రాయంపువాఁడు ద్రామిళుఁ
డాయన యిల్లాలు బిడ్డ లందపుఁ గందుల్. 2

చ. అరసి యెఱుంగ దిందనుక
 నత్తిలు నత్తలునీమతల్లి కాఁ
పురమున కాపురమ్మునకె
 పోయెను బిడ్డలు నల్గు రైదుగుర్
వరుసఁగ నచ్చటే కలిగి
 వర్ధిలుచుండిరి సర్వసౌఖ్యముల్
దొరకొనఁ దత్కుటుంబము కు
 దుర్కొనె నక్కడఁ బెక్కునాళ్లుగన్. 3

క. సోమరితనమున కలసట
కేమఱుపాటునకుఁ జోటు నీయక యా యిం
టామె యిలు దీర్చుకొంచుం
బ్రేమించున్ మగనిప్రాపు బిడ్డలప్రోపున్. 4

గీ. ఇంతలింత లంతలంతలు నగు నగు
మోము నిసుఁగు లింట గోము లెసఁగ
దోస పండ్లువోలె దోఁగాడుచుందు రా
నిండు గన్నుఁ గనులపండు గన్న! 5

ఉ. గొబ్బున వచ్చి యొక్కసను
గుద్దుచు నీడ్చుచు త్రెఁక మాఱుచేఁ
బ్రబ్బి మఱొక్క సన్ దడవి
పట్టుచు రెండును బాలవంక లై
యుబ్బి స్రవింపఁగా జనని
యుం దల మూర్కొనఁ బొట్టనిండఁగాఁ
జుబ్బనఁజూఱ లాడెడు ని
సుంగుఁ గనుంగొన వేడుకయ్యెడున్. 6

మ. కుచసంపన్నత కూలిపోవు ననియో
క్రొవ్వారు మైసొరు విం
తచమత్కారము లంతరించుననియో,
స్తన్యంబు లేకుండ గు
బ్బచనుల్ దిబ్బలుగా నొనర్చుకొని ద
బ్బాపాలచే నిష్ఠ పు
త్ర చయంబుం బరిమార్చు మాతలటె మా
తల్! కాలదూతల్ గదా! 7

వ. ఇప్పటి కయిదా ఱేండ్లకు ముందక్కడ జరిగిన యక్కటిక పు
వృత్తాంత మొక్కటి యిక్కడ చెప్పఁబూనినది. అది శ్రావణమాసము. 8

గీ. దాఁటె బెజవాడ యనకట్ట నీటి మట్ట
మిర్వ దడుగులకుం బయిఁ, గృష్ణ వేణ్ణి
యుభయతటముల నిండారి యుబ్బి పొంగి
పొర్లి పార్వాఱుచుండె సముద్రమునకు. 9

శా. కూలెం గొంపలు ప్రాపుదక్కి పఱచెం
గోతండముల్ నీటికిం
బాలయ్యెన్ ధనధాన్యసంతతులు జీ
వం బింత గాపాడుకోఁ

జాలం దుర్ఘట మయ్యెఁ బల్లెల కవ
స్థల్ హెచ్చెఁ గృష్ణామహో
ద్వేలస్ఫూర్జితదుర్నివారవిసర
త్తీవ్రప్రవాహార్భటిన్. 10

గీ. ముసురు వెసహెచ్చె; నీఁదురు విసరఁజొచ్చెఁ;
బుట్టలన్ గట్టులన్ నీరు దొట్టి నిలిచె;
వరదపెచ్చుతో నూరెల్ల బురదతొచ్చు
గజిబిజి ఘటించె నపుడు శ్రీకాకుళమున. 11

గీ. అధికమౌ ప్రవాహ మప్పుడు కృష్ణకు
నధికమౌ ప్రభావ మంచు నప్పు
డరుగుదెంచుచుండి రిరుగూళ్లనుండియు
నాఁడువారు స్నానమాడువారు. 12

గీ. పసుపుకుంకుమములతోడఁ బండ్లతోడఁ
బూలతోఁ గృష్ణవేణ్ణకుఁ బూజఁజేసి
మ్రొక్కుచుండిరి పసి పైరు చక్కఁబడఁగ
నత్తఱిని బుణ్యకాంతలు తత్తటముల. 13

సీ. కూఁకటిప్రేళ్లతోఁ గూలి తేలి యనేక
వృక్షంబు లంబుధి కేఁగుచుండె
వడిఁ దప్పికొని చచ్చి చెడి చేరుకొనుచుండె
నెట్టకేలకుఁ బసుల్ గట్టులకును,
బెడిసి కన్పడు మీల నొడిసి కొట్టుచునుండెఁ
గొంగలు మింటఁ గొంగొంగు రనుచు,
లంకల దాఁటి కూలంకషం బగు నేటి
ముంపు గన్గొనఁ బ్రజల్ మూఁగుచుండి

రాపదలఁ జేపడెడువారి కాపుకొఱకు
నిరుదరులయందుఁ బడవలు తిరుగుచుండె
నాల్గుమైళ్ల వెడల్పు కృష్ణాస్రవంతి
సాగరమువోలె భయదమై సాగుచుండె. 14

శా. స్నానార్థం బల యింటియామె చనె సం
తానమ్ముతో, నప్పు డ
చ్చో నుండెన్ దగురేవుఁ జూపి దరిఁగూ
ర్చుండెన్ విభుం, డామెయున్
దా నొక్కొక్కరిఁ గాఁగఁ జేతఁగొని సం
తానమ్ము నీరార్చుచుం
బైనీటం బడి వచ్చు తుమ్మ ములుఁగొ
మ్మం జూచెఁ జేచెంతఁగన్. 15

క. పై కేఁగుదెంచు నంచుం
గైకొని యాకొమ్మ విసరెఁ గడఁగాఁ బడఁగా
నాకొమ్మ, యందు మిసమిసఁ
బ్రాఁకినయ ట్లయ్యె నదియుఁ బామో యేమో! 16

వ. అంత నాయమ్మ. 17

గీ. "మోపిదేవి సుబ్రహ్మణ్యమూర్తి! నీకు
మ్రొక్కు చెల్లింతు దర్శనమునకు వత్తు
పుట్టలోఁ బాలు పోయుదుఁ బురుగు భయము
కల్గకుండ నాబిడ్డలఁ గావు" మనియె. 18

సీ. కురులు చిక్కార్చి దిక్కులు గాంచి చేలాంచ
లము దిద్దుకొని కంచెలన్ దొలంచి
మొగము మంగళసూత్రమును నొలగందంబు
పసుపునఁ బూసి మన్ విసరివైచి,
గుము రొత్తుపులకల నిమిరి పొక్కిలి బంటి
నీట నీ రెండ మైనాఁట డిగ్గి

గుమ్మడిమూటగాఁ గూర్చుండి చిగురాకు
దొప్పదోసిళ్ల నీ రప్పళించి
దరిని గల బ్రాహ్మణుండు మంత్రములు పలుక
నలకనకగాత్రి కృష్ణలో జలక మాడెఁ
గరఁగఁబోసిన పొంగు బంగా రనంగ
నంగకాతులతోడఁ దరంగ లాడ! 19

గీ. అర్ఘ్య మిడి సూర్యునకు "హరహర" యటంచు
ముకుసెవుల్ మూసికొని యామె మునుకగొనఁగ
"మునిఁగె మాయమ్మ యయ్యయో మునిఁగె" ననుచు,
బిడ్డ లెల్లరుఁ దందర బింద రైరి. 20

గీ. అఁకలేక యఖండమై యాది యంత
మెఱుఁగ రాకుండఁ బ్రవహించు నేటి నీట
మున్గి యాకాంత కనరాకపోయె నింత
పోల్కి యిదె కాలవాహిని మున్క కనఁగ. 21

వ. అంత నాయమయు సుస్నాతయై. 22

శా. 'భానోభాస్కర' మంత్రమున్ నొడువుచున్
భాస్వంతుఁ బ్రార్థించి తీ
రానన్ మంత్రముఁ జెప్పినట్టి ద్విజు న
ర్థం బిచ్చి మెచ్చించి సం
తానోపేతముగాఁగ నామె చనె నం
తన్ గాకుళాధీశ్వరున్
శ్రీనారాయణు నంధ్రవల్లభుని ద
ర్శింపం దదాస్థానికిన్. 23

శా. "మాకుం గాఁపుర మీ పురమ్మగనె సం
భావింపఁగా నయ్యె నే
మోకానీ పెఱచోటి కేఁగఁదగు ను
ద్యోగంబు మా ర్వేదియున్

లేకుండెన్, సుఖమయ్యె, నెప్పుడు నిదే
లీలన్ గటాక్షించుచున్
శ్రీకైవల్యమొసంగి యేలుకొనవే
శ్రీకాకుళాధీశ్వరా!" 24

గీ. అంచు వేఁడుకొంచు నర్చించి తీర్థప్ర
సాదములు గ్రహించి సంబరమున
బిడ్డ లపుడు కాళ్ల కడ్డాలు రా నిల్లు
సొచ్చెఁ గాంత; భర్త వచ్చె నంత. 25

క. శ్రావణమంగళవారము
గావున నోముగలబాలికలు పెక్కురు దో
డ్తో వచ్చి రింటి కాయమ
నావేళన్ బేరఁటమున కాహ్వానింపన్. 26

క. ఉత్తము నొక బ్రాహ్మణు నొక
ముత్తైదువఁ బిలిచి పెట్టె భోజన మా నాఁ
డత్తరుణీమణి పాపపుఁ
బొత్తింకన్ నాకుఁ బోయెఁబో యని తనిసెన్. 27

ఇది తేపటివేళ

## మాపటివేళ

ఆరగించి యుద్యోగ కార్యములు సూచు
కొనుచుఁ గుర్చిపై నిలుతేఁడు గూరుచుండె
చంటవెంటను బిడ్డలు సందడింప
జెంతఁ దాంబూల మిచ్చుచుఁ గాంత యుండె. 28

గీ. నాఁటి సుస్నాన సౌభాగ్య మాటలాడు
చిఱుతనిసుఁగుల మురిపముల్ చిత్తములకు
సుప్రసన్నత గూర్ప నాసుదతి విభుని
మాటపైమాట ముచ్చట మరగుటయును. 29

వ. అపుడు టపాబంట్రౌతు జాబులఁగొనివచ్చెను. వానిలో నుద్యోగ ప్రసక్తములనువరదయొడుదొడుకుదినములు గాన యాత్రముతో నాతఁ డారసెను. అందొకటి యాతని యుద్యోగయోగ్యత నుగ్గడించుటతో నించుక జీతముపెంపును, మద్రపురమునకు మార్పును దెలుపు నదిగా నుండెను. 30

గీ. హెచ్చుజీతము పైవారి మెచ్చుకోలు
కొంత సంతోషమును మును గొలిపెఁ గాని
కడు సుఖముగూర్చు నచ్చోటు వెడల మార్చు
టరయ నాతనియెద దిగుల్ నెఱయఁజొచ్చె. 31

గీ. అదియు నిల్లాలి కాతఁడు చదివి చెప్పెఁ
దప్పుకొనరాని దనియును దానిఁ దెలిపె
ఆఁగరాక విచారంబు రేగ శోక
ముద్రితాస్యయై యా సాధ్వి ముదలకించె.  32

ఉ. "జీవిత మెక్కు వే యవును
జెన్న పురంబు వ్యయంబు పైపయిం
బోవును లాభమేమి? యిహ
మో పరమో యెదో నాకుఁ గాకుళ

శ్రీవిభు సన్నిధిం బడయఁ
జేయుఁడు వేఁడెద; నెల్ల వెంట సౌ
ఖ్యావహ మీపురంబు విడి
యావలఁ బోవఁగఁ జాల నయ్యెదన్. 33

ఉ. జీవిత మెక్కు వే సరియె
చెన్నపురంబున నున్న క్షేమమున్
జీవిత మల్ప మౌనని వ
చింతు రెఱుంగుదురేకదా! సుఖా
భావము సంకటస్థల ని
వాసము కృత్రిమవస్తుభోజనం
బేవిధి సైఁతుమోకద యె
టే నిది త్రిప్పుకొనంగఁ జూడుఁడీ! 34

వ. అనుటయు; 35

గీ. "ఆదరముమీఁద మార్చిరి, యైదొ పదియొ
వేతనము హెచ్చుచేసిరి, వెళ్లితీఱ
వలయు; నిఁక నీవొ వంటింటి వార్తలేవొ
పల్కుదువు నిర్వహింపఁగాఁ జుల్కగాదు. 36

గీ. నాకు నీకంటె హెచ్చు చీకాకు గలదు,
పని యధిక మింకఁ బయిని రాబడియు నున్న
చెన్నపురమందు నుద్యోగ మెన్న 'దంపి
నమ్మకును బొక్కినదె కూలి' యన్నరీతి. 37

వ. మఱియు. 38

సీ. అవగాహనస్నానమా, అబ్బె నని ముక్కు
మూసికోవలెఁ గూవమునదిఁ జూచి!
కమ్మని కూరలా, కల వని తలయూఁప
వలెఁ దిర్వలిక్కేణిపాలము నరసి!

చల్లనిగాలియూ, చాలుఁ బొమ్మని తల్పు
గడెవేయవలె దొడ్డికంపు సోఁకి!
ఆరోగ్యమా, తక్కువా యేమి యని పొంగి
పొరలఁగావలెను డాక్టరుల నెఱిఁగి,
భాగ్యభోగ్యాభిలాష మభ్యధికపఱిచి
తదుపభోగోపపత్తి దుర్బలత చే న
వస్థఁగూర్చు సామాన్యగృహస్థునకును
జెన్నపురము కాపుర మెట్లు చేయఁగలమొ! 39

సీ. చేకూఱునో లేదొ శ్రీకాకుళేశ్వర
స్వామి దర్శన మహోత్సవము మరల
లభియించునో లేదొ యుభయసోమేశ్వర
క్షేత్ర యాత్రా భాగ్యసిద్ధి మరల
దొరకునో లేదో మధురవర్తనము గల్గు
తెల్గుగేస్తుల చెల్మితీరు మరల
కలుగునో లేదో సఖశ్రీదమైన కృ
ష్ణాపకంఠోద్యోగయుక్తి మరల
సంఘటిల్లునో లేదో ప్రశస్తవస్తు
భరిత మగు నాంధ్రభూమి కాఁపురము మరల
నెప్పు డెదివచ్చునో యెవ్వఁ డెఱుఁగు నిపుడు
తిరగ దొకమాత్ర దక్షిణదేశయాత్ర." 40

వ. అనుటయు నా యువిదవల్లభుని పలుకుజాడ నిట్లు వాపోయెను: 41

సీ. "ఎన్నఁడు చూతునో యింకొక్కమా టేను
దివ్యకృష్ణాస్రవంతీప్రవాహ
మెన్నఁడు విందునో యింకొక్కమా టేను
తేటతేనియయూట తెలుఁగుమాట
ఎన్నఁడు నోఁతునో యింకొక్కమా టేను
శ్రావణ శుక్రవార వ్రతంబు

ఎన్నఁడు తిందునో యింకొక్కమా టేను
వాయూర లంకవంకాయకూర
ఇంక నెన్నఁడు వత్తునో యీ గృహమున
కీపురము కాఁపురము సరియేమొ నాకు
నాకులమ్మయ్యె మనసు శ్రీకాకులమ్ము
విడిచి దక్షిణదేశంబు వెడలు టన్న! 42

ఉ. ప్రాఁకెను సూర్యరశ్మి చొరఁ
బాఱఁగ నీయక యల్లిబిల్లిగా
నాకులచాటునం గనుల
కందఁగనీయక చిట్లపొట్ల నా
వ్రేఁకనఁ గాచుచుండె; నెడ
త్రెవ్వక మవ్వపుఁగాయ; లిప్ప డీ
కాఁకరపాదు వీడి కడ
గా నిడఁగా నడు గాడ దయ్యయో! 43

గీ. పయరకూర వేచి పచ్చి మిరెపపండ్ల
నుక్కళించి పోసి యూరనిచ్చి
కొంత గొంత పొగిపికొను గోఁగుఁబచ్చడి
చవికి నింక నోరు చివికి తీరు.'' 44

వ. నా నాతండు ని ట్లనియెను. 45

సీ. "పరిమళించెడు తెల్లవిరికొత్తిమిరిచేల
యింపుఁజూచుచు సంచరింపఁగలిగె,
ఘృతదధిప్లుతముగా నతిరుచ్యముగ మిత్ర
గృహముల విం దారగింపఁగలిగె,
తోఁక పైకెత్తి గంతులు ఱంకె లిడుచుండు
కోడెదూడలపిండు చూడఁగలిగె,
సెనగకాయలు మొక్కజొనకండె లూచకం
కులు గాల్చి చిఱుఁదిండ్లు సలుపఁగలిగె

హృదయ మిచ్చి యాదరించుగృహస్థుల
నడుమఁ గాఁపురం బొనర్పఁగలిగె
కేలుమోడ్పు నీకుఁ గృష్ణాతరంగిణీ
తీరశోభితాంధ్ర దేశలక్ష్మి! 46

క. చక్కెర యక్కఱలేనివి
చిక్కని పాల్ గడ్డపెరుగు జి ద్దగునేయున్
మిక్కిలి చవి గల కూరలు
చిక్కున్ గృష్ణాస్రవంతి చెంతలయూళ్లన్. 47

ఉ. ఓర్వరు మాయమర్మముల
నుజ్జ్వలధీమహిమంబు పేర్పడన్
నేర్వరుగాక విద్దియలు,
నెయ్యముతియ్యము చూచుకొంద్రు లో
గర్వము తక్కువే యయిన
గంద్రతనంబునఁ గానవత్తు రా
యుర్వపురుజ్జ్వలుల్ బలస
మున్నతు లెన్నఁగ నాంధ్రపుత్రకుల్. 48

క. ఆతిథ్యగౌరవంబును
స్వాతంత్ర్యప్రియత, స్వల్పసంతోషము, దు
ర్నీతివిహీనత, నైచ్యా
పేతత్వము నాంధ్రులందుఁ బేర్పడుగుణముల్. 49

సీ. మాయమర్మము లేక మర్యాద గోల్పోక
మాధుర్యమున మీఱు మాటతీరు
క్రుంకు జంకులు లేక బింకంబు గోల్పోక
విప్పారి యొప్పారు వెన్నుతీరు
లౌల్యంబు లేక చాపల్యంబు గోల్పోక
తీపుతీయము లూరు చూపుతీరు
క్రొవ్వుం బులుపు లేక మవ్వంబు గోల్పోక
నడపున బెడఁగారు పాదపుతీరు

అఖిలభారత క్షమాభ్యంతరస్థితా
నేకజాతియువతిలోకమునను
నిస్సమానరీతి నెగడుఁగదా తెల్గు
నాతియందు వీరమాతయందు.''

వ. అని యిట్లు గొంతదడ వంధ్రతయెడఁ దమకుఁ గల యాదరమును
వారు పరస్పరము పేరుకొనిరి. 51

శా. పోటుంబాటుగ రేఁగు చాఁగుచును ద
త్పుణ్యస్థలత్యాగదుః
ఖాటోపం బటు గొంతదాఁక నల భా
ర్యాభర్తలన్ వేచెఁ గా
ర్యాటంకంబున నిర్వారుం గదలి ర
త్యాతంబు దుఃఖంబొ యా
రాటంబో విధి సాగనీయదుగదా
ప్రాపంచికవ్యాపృతిన్. 52

గీ. క్రొత్తయేటినీటఁ గ్రుంకుటఁ దలలకు
నొండుమట్టి పట్టియుండు ననుచు
బిడ్డలకుఁ దలంటి వేన్నీరు వోసెను
పాలితి దానుగూడఁ బోసికొనియె. 53

గీ. క్రుంకనున్నాఁడు సూర్యుండు ఘోరమైన
యంధకారమ్ము క్రమ్మునటంచు నామె
వీడుగదలెను బేరంటమాడుటకును
వడివడిగ నాఁడు మంగళవార మగుట. 54

గీ. ఆరఁబూచిన గున్న గన్నేరు చెట్ల
యట్లు నీర్కావికోకల నందగించి
కొంద ఱరుదెంచి రువిద లాయంద ఱొక్క
బృందమై పేరఁటమ్ము చరింపఁ జనిరి. 55

శా. తెప్పల్ నిండి విశాలనేత్ర మధుర
శ్రీ లాత్మసౌభాగ్యముం
జెప్పన్ నిండుపయంట సత్కులవధూ
శీలమ్ము రూపింపఁగాఁ
గొప్పుల్ పువ్వులఁ బుక్కిలించుచును సౌ
గుణ్యంబు వాసింపఁగా
నప్పుణ్యాంగన లొప్పి రంధ్రవిభవం
బచ్చొత్తుచున్నా రనన్. 56

ఉ. ఐహికభాగ్యలక్ష్మి నడ
యాడఁ దొడంగినదో యనన్ సుత
వ్యూహముతోడ నాభరణ
భూషితయై యలపుణ్యసాధ్వి యు
త్సాహము గొంత కొంతపరి
తాపముఁ దోఁపఁగ నాల్గువాడలన్
గేహము గేహమున్ విడువ
కే చనెఁ బేరఁట మాచరింపఁగాన్. 57

సీ. ఆదరంబునఁ బిల్చినంద ఱిళ్లకు వెళ్లె
నచ్చటచ్చట ముచ్చటాడెఁ గొంత
సంతాపమునఁ దనచననుండు టెఱిఁగించె
ముంచె వారి వియోగమోహవారి
వా రిచ్చినవి తాల్చెఁ బసుపుఁ గుంకుమము తాం
బూలంబు సెనగలుఁ బుచ్చుకొనియె
తెచ్చుకొనియె నీరు వెచ్చఁగాఁ గన్నార
వేఁడుకొనియె వారి వీడుకోలు
మరల దర్శనంబు దొరకొనునో లేదొ
మఱవవలవ దనియె, మఱియు ననియె
బొంది యరుగుఁగాని యందులప్రాణ మీ
యూరు విడిచి యరుగనేర దనుచు. 58

వ. అంత; 59

గీ. వాడవాడకుఁ బేరంటమాడ నరిగి
తిరిగివచ్చిరి వారెల్లఁ దీగబోండ్లు
ఇల్లుసేరిచి యామెచే మెల్ల వీడు
కోల్వడసి; రప్పటికిఁ బ్రొద్దు క్రుంకుచుండె. 60

ఉ. చమ్మఁగ గోరువెచ్చగ సు
సహ్యముగా వెలుఁగొంది యార్ద్రుచేఁ
గుమ్మెలువోవు జీవుల నె
గు ల్డొలఁగించిన వేఁడివెల్గు తే
జమ్ము క్రమమ్ముగా ముడిఁగి
జాజుకొనన్ జరమాచలంబుపై
గుమ్మడిపూవుచందమునఁ
గొండొక గన్పడె బింబమాత్రమై. 61

ఇది మాపటివేళ

## చీకటివేళ

సకలజగమునకును జైతన్య మొనగూర్చి
కాంతి మెఱసినట్టి కర్మసాక్షి
తేజుదొఱఁగి చాటుగాఁ జనె నిఁకమీఁద
నేది జరిగెనేమి యెవరి కెఱుక? 62

గీ. సూర్యు ననిపెనుఁ జంద్రునిఁ జుక్కగమిని
మబ్బు తెరచాటునకుఁ దార్చి మాటుపఱిచెఁ
గాలమాయావి యిఁకనేమి కానిపనులు
చేయనున్నాఁడొ ముం దెట్లు చెప్పవచ్చు? 63

గీ. నాఁడు మానిసి యరమేను పాడుపడెను
తేజుమాసెను దానికిఁ దెలివిమాసె;
పక్షవాత మహావ్యాధిబాధయేమొ?
కల్గునట పక్షపాతదుర్గతుల కదియు. 64

సీ. మెల్ల మెల్లగఁ బిల్లు లిళ్లెల్ల శోధించు
గ్రుడ్లగూబలు చెట్లకొమ్మ లరయు
పురుగుపుట్రలు పుట్ట పొదరు వీడి చరించు
బెబ్బులుల్ కానల బొబ్బరించు
జారచోరులు తప్పుదారు లారయుదురు
మాయామహాశక్తి మచ్చరించు
జాగ్రత్త చల్లఁగాఁ జల్లనాఱును విజ్ఞ
తాద్రవ్య మది మోహ ముద్రిత మగు
అదరి కామపిశాచి తా నావహింప
నరులు నారులు చెలరేఁగి మరులుకొందు
రెందుకని సృష్టి చేసెనో యీశ్వరుండు
కటికతన మూని కటికచీకటిఁ గటకట! 65

వ. అప్పు డా యిల్లాలు, 66

గీ. శీఘ్రముగను వంట చేసెను భర్తకు
బుడుతకుఱ్ఱలకును భుక్తి వెట్టి
అద్దె యింటివారి పెద్దమంచముపయిఁ
బరుపు దులిపి చక్కఁ బ్రక్కఁగూర్చె. 67

ఉ. "మంచముమీఁదఁ బుత్రకుల
మధ్యమునన్ శయనించుఁ డంచుఁ" బ్రా
ర్థించెను భర్తఁ, బుత్త్రుల క
దే వెసఁజెప్పెను "వానయీదురున్
మించెనుగాన యయ్యకడ
నే శయనింపుఁ" డటంచు, నా సుతుల్
కొంచెముగూడ దాని కను
కూలురు గారయి రెంత చెప్పినన్. 68

ఉ. "నాయన చెంతఁ బండుకొని
నన్ మఱి నిద్దుర రాదు మాకు న
మ్మా! యదియేల నేలపయి
మాకును నీకడఁ బ్రక్కఁగూర్పుమా
హాయిగ నిద్రవోదు మిపు
డన్నము నీవును దిన్నదాఁక మే
మీ యెడఁ గూరుచుందు" మని
యెంతయు వారలు పంతగింపఁగాన్. 69

క. చెప్పిరి వల దని చెప్పిరి
చెప్పిరి తలిదండ్రు లెంత సెప్పిన నది వా
రొప్పికొన రయిరి కడకుం
దప్పనిసరి వారిపట్టుదలయే నెగ్గెన్. 70

వ. అందులకు, 71

గీ. "అమ్మ యమ్మ యటం చెప్ప డమ్మకొఱకె
రోదనం బాయె నే మౌదురోకదమ్మ

అమ్మ లేకున్న" నని యామె యుమ్మలించి
యార్తయై పల్కె నది విని భర్త యుల్కె. 72

గీ. జనని భోజనమ్ము సలుపుచు నుండఁగాఁ
గొడుకుఁ గుఱ్ఱ లెదురఁ గూరుచుండి
రెట్లొ కనులఁ గునికిపాట్లు తాండవమాడ
నాఁచుకొనుచు నిద్రఁ బాచుకొనుచు. 73

ఉ. వేగ భుజించి యం ట్లరసి
విస్తళు లెత్తి విశుద్ధిఁజేసి క
న్నాగక తూఁగు బిడ్డలకు
నై వడి సావడిలోన నేలపై
బాగుగఁ గంబళిం బఱచి
ప్రక్కఘటించెను "జక్కసాగె మీ
యాగడమే" యటంచుఁ దన
యావలి నావలిశయ్యఁ జేరిచెన్. 74

క. శయనించెఁ బట్టెమంచము
పయిఁ బెనిమిటి, పుత్రకులును భార్యయు నేలన్
శయనించిరి; తోడ్తో ని
ద్రయువచ్చెన్ సాధ్వి యొక్కతయ మెలఁకువతోన్.

ఉ. "చెప్పితిఁ జెప్పితిన్ వినరు
చిట్టినిసుంగులు పట్టెమంచమం
దొప్పుగ నిద్రవోవఁ దగ
దో! నిదు రాచిరి కాచి రింత కీ
చొప్పున నేల నన్నొఱయు
చున్ శయనించిరి యమ్మమీఁద మా
యప్పల కెంతప్రేమ మహ
హా" యనిఁ చేఁ దడవాడె వారలన్. 76

ఉ. చిక్కఁగ వెన్నునంటి పయిఁ
జేయిడి యొక్కఁడు, నాచియాచి పాల్

గ్రుక్కలఁగొంచు నొక్కఁడును,
గోక చెఱంగును గొంచు నొక్కఁడున్,
ముక్కును మూతియుం దడవి
పుణ్కుచు నొక్కఁడు, పుత్త్రు లమ్మ కిర్
ప్రక్కలఁ జక్క నిద్రగొని
రమ్మకు నెమ్మది చెమ్మరింపఁగాన్. 77

శా. "స్వామీ యేమియు నేర రీ నిసుఁగు ల
జ్ఞానుల్గదా! నాయెడన్
బ్రేమోద్రేకముచేత నేలపయినే
నిద్రించుచున్నారు; ని
ద్రాముద్రా వివశత్వమం దిపు డన
ర్థంబేమి లేకుండఁగా
క్షేమంబారఁగ వీరి నేలుకొనవే
శ్రీకాకుళాధీశ్వరా! 78

వ. అంచుఁ గాకుళేశ్వరుఁ బ్రార్థించి తానును నిద్రావివశ యయ్యెను. అప్పుడు, 79

సీ. కీచురాళ్లు రవళ్లు రేఁచె బాలకు లీల
వై చినట్టును గంచుగీచినట్టు
భేకముల్ నెగయించె బెకబెక లఱవఱ,
లఱవలు బెరసి కాఱాడినట్టు
పాఱువాఱెడు వెల్లిహోరు ఘోరంబయ్యెఁ,
బేర్చి గెల్చినసేన యార్చినట్టు
ముసురు చీకటి యాద్రు ముజ్జిడ్డుగా రేఁగెఁ,
గఱ వక్కఱయు లేమి దొరసినట్టు
పౌరు లటువంటి చీకాకు కారణముగ
గుండెలు గుబుల్ గుబుల్మని కొట్టుకొనఁగ
వారివా రిండ్లలో వారువారు వెచ్చ
ముచ్చముడిఁగి నిద్రించిరి ముచ్చ టుడిగి. 80

వ. అంతఁ గొంతకుఁ దద్గృహమున, 81

ఉ. లాంతరులోన దీపము చె
లంగుచునుండెను రాత్రి యెంతయో
కొంతచనెన్ గడంగి పసి
కున్నఁడు మేల్కని పాల కేడిచెన్
గాంతయు నంతమేలుకని
కా ల్కయి కద్దికొనంగ నంగణ
ప్రాంతముకై చనెన్ దెఱచి
ద్వారము వెల్తురు దారిచూపఁగాన్. 82

ఉ. కొండొకయేడ్పి కన్మొగిచెఁ
గుఱ్ఱఁడు 'పాలకు నేడ్చె బాలకుం
డెండెనొ గొంతు' కంచు జన
యిత్రియు నాత్రముతోడఁ దల్పులన్
గొండెము వేసివచ్చెఁ బడు
కొన్నకుమారకు మూరుకొంచుఁ గూ
ర్చుండెను జేపువచ్చి చను
లుబ్బఁగ దబ్బున మేలుకొల్పఁగన్ 83

శా. తెల్లంద్రా చటె యప్పు డామెపయి కు
ద్రేకించి దూఁకెన్ బుసల్
చల్లెన్ పైఁ బడగార్చె నంత సుతర
క్షాచింతయే తక్కఁ ద
క్కెల్లన్ ద్రోపద నాపె పాపశిర మ
ట్టే పట్టె నిర్చేతులన్
"బిల్లల్ పిల్లలు పిల్ల" లంచు నఱచెన్.
బీభత్సకంఠధ్వనిన్. 84

ఉ. నిద్దుర మున్గియున్న మగ
నిన్ సుతులన్ మఱి పొర్గువారలన్

దద్దరిలంగఁజేసె నల
తన్వి విషాదపురోదనస్వరం
బెద్దియుఁ దోఁపకే పెనిమి
"టే మది యే మది" యంచు గుండియల్
బ్రద్దలుగా నిలంబడియె
బాలురు లేచిరి గోలుపెట్టుచున్. 85

క. "అయ్యో! బిడ్డలఁ జేకొనుఁ,
డయ్యో బిడ్డ" లనియేడ్చు నంతేకానీ
యయ్యమ్మ పాముఁబట్టితి,
చె య్యిదిగో కఱచు నంచుఁ జీర దయారే! 86

ఉ. "మంచముఁ జేర్చుఁడీ వడిగ
మంచముఁ జేర్చుఁడి కన్న బిడ్డలన్
మంచముఁ జేర్చుఁడీ" యనుచ
మాంతముగా సతి యట్టు బిట్టు రో
దించుడు నేమిమూడెనొ గ
దే యనుచున్ బతి యుక్రి బిక్కరై
కాంచియుఁ గాంచలేని కను
కాన్పున బిడ్డలఁ జేర్చె మంచమున్. 87

ఉ. అభ్రుశదుస్సహస్వరవి
హారము హెూరని మ్రోయు వెల్లి సం
క్షోభము మీఱ యొదురు ము
సుర్ కలిగించెడు పీడ మించి ని
ద్రాభర ముద్రి తాక్షులగు
తత్పురవాసుల లేవఁగొట్టెఁ దం
ద్రీభయభుగ్నులన్ జలిపి
తెచ్చెను జెచ్చెర వారి యింటికిన్. 88

వ. అప్పటి కక్కడ, 89

శా. ఘోరక్రూరవిషోరగంబు తలతోఁ
గొట్టాడుచున్ దోఁకతో
నారీరత్నము హస్తయుగ్మకము నం
టన్ జుట్టె, నట్టే యెటుం
బోరాకుండఁగఁ బట్టె నామెయును ద
న్మూర్ధాధరోద్దేశమున్
ధారల్ గారుచునుండె రక్తము కర
ద్వంద్వంబునం దామెకున్. 90

శా. వారున్ వీరును వచ్చి యచ్చిలువ నొం
పన్ జంపఁగా నేర రై
రారన్ జుట్టెను రెండు చేతులను బు
స్సంచూచుచుండెన్ దలన్
ధీరుం డందొకఁ డుత్తరీయమున నె
త్తింగప్పి యప్పాము సం
హారించెన్ బ్రయతించి వీడుపఱిచెన్
హస్తద్వయం బామెకున్. 91

ఉ. బిడ్డలఁ జంపునో యనెడి
భీతిని నా తరుణీమతల్లి త
న్నొడ్డెను బాముఁ బట్టుకొనె
నొండు విచారము నేరదయ్యె నా
బిడ్డల ప్రాణముల్ నిలిపెఁ
బిమ్మట నాత్మకథన్ గనుంగొనెన్
గ్రుడ్డులు తేలవైచెఁ 'గనుఁ
గో భగవంతుఁడ!' యంచు మ్రొక్కెడెన్. 92

ఉ. పాలకు నేడ్చినట్టి పసి
బాలుఁడు పైఁబడెఁ, దక్కువారు గ
గ్గోలయి యేడ్వఁజొచ్చి, రట
కొందఱు మందుల నూఱితెచ్చి, రా
భీలవిషార్చు లంగములఁ
బేర్చి దహింప నుపక్రమించెఁ, బు

త్రాళిని భర్త నత్తఱి స
మాకులయై కని యాకె వాకొనెన్. 93

ఉ. "ఒత్తిలి యేడ్పు నాఁకటికి
నోపఁడు పాపఁడు, చేఁపువచ్చెఁ బా,
లిత్తు నటన్నఁ బాపవిష
మెట్లొకొ? యి ట్లొకయింత యేడ్చి తా
నత్తఱిఁగూరికెన్, దెలియ
దయ్యెను దయ్యము నెత్తికో, లయో
నెత్తిని మూఁగియున్న పెను
నిద్దుర యిద్దురవస్థఁ గూరిచెన్." 94

వ. అని మఱియు, 95

క. "పసిబిడ్డల సేమ ముపే,
క్ష సేయవల; దట్లుమీరు శపథము సేయన్
వ్యసనమ్ముపీడి సుఖముగ,
నుసురువిడుతు" నంచు భర్త నొత్తిలి వేఁడెన్. 96

మ. "కసుఁగందుల్ వెరవెందు లేదు, తఱికిం
గడ్వార నాహార మి
చ్చి సమాశ్వాస మొనర్తు రెవ్వ రిఁక? మీ
క్షేమంబెటో?" యంచుఁ ద్రొ
క్కిసలాడెన్ బతిఁజూచెఁ బుత్త్రులఁగనెన్
గేలార్చె నిట్టూరిచెన్
"బసిబిడ్డల్ పసిబిడ్డ" ల న్పలుకుతోఁ
బ్రాణంబులన్ వీడ్కొనెన్. 97

ఇది చీకటివేళ

# ముగింపు

ఆయమ మంద చేతఁగొని
యావలవైవఁగ రేవుచెంత నే
దో యగపడ్డ దట్టె యది
యూహ యొనర్పఁగ సర్పమే యగున్
బోయిన జీవమున్ నిలిపెఁ
బ్రొద్దుట నాయమచేయి, యిప్పుడా
చేయియె శత్రువై కఱవఁ
జేకుఱె నా కుటిలాహిదంష్ట్రకున్. 98

వ. ప్రజ లామె నిట్లు ప్రస్తుతించిరి: 99

గీ. "కొడుకుఁ గుఱ్ఱలకై జంకుఁగొంకులేక
పాసెఁ దనప్రాణములఁ దృణప్రాయముగను
బూటకంబయ్యె నిప్పు డీబోటివలనఁ
బ్రాణ మన్నింటికంటెఁ దీ పనెడిపలుకు. 100

శా. చేసెన్ గాపుర మీ పురమ్మునసె ల
క్ష్మీదేవి వోలెన్ సుత
శ్రీసంపన్నత వన్నెఁగాంచెఁ బ్రియునిన్
సేవించె భృత్యాళి నా
యాసంపెట్టక సాఁకె వాఁకిటి కతి
థ్యభ్యాగతుల్ రా సమా
శ్వాసించెన్ సుతరక్షకై తుదకు ను
ద్వాసించె సర్వస్వమున్. 101

సీ. కృష్ణవేణ్ణాతరంగిణిలో ససంతాన
మానందమున స్నాన మాచరించె
ఆంధ్రవల్లభదేవు నారాధన మొనర్చెఁ
దలఁదాల్చెఁ దత్పాదజలముఁ దులసి
పూచిన తంగేడువోలె భూషలు దాల్చి

యింటింటి కరిగెఁ బేరంటమునకు
పౌరాంగనలచేతఁ బసుపుఁ గుంకుమములు
గొనియె నెల్లర వీడుకోలు పడసె,
పుత్త్రరక్షార్థమై ప్రేమమూర్తియగుచుఁ
బుణ్యకాంతాత్వమున ముక్తిఁ బొందె ననుచు
నాఁడునేఁడును బెంపారు నామెపేరు
పేరుకొని కొనియాడు నాయూరునాఁడు. 102

ఉ. తేళ్లను సర్పముల్ మఱి యె
దే విషజంతువు నాఁటనుండి యా
యూళ్లను బాధపెట్ట వటు
లొక్కెడ నెక్కడ నేని పెట్టినన్
సళ్లను నామెనామ మొక
సారి దలంచిన బాధయెల్ల; దే
వళ్లను గొల్చుచో నల సు
వాసిని కొల్పును సాగు నచ్చటన్. 103

శా. "ఆత్మార్థం పృథివీం త్యజే" త్తనెడు వా
క్యం బేమి వాక్యంబొ తా
రాత్మత్యాగమునన్ జగమ్మునకు శ్రే
యంబుం బ్రసాదించి ధ
న్యాత్ముల్ శాశ్వతపుణ్యలోకముల నా
హ్లాదింతు; రాయమ్మ య
ట్లాత్మత్యాగ మొనర్చెఁ దీర్చెను విషా
పాయమ్ము నా యూళ్ల లోన్. 104

గీ. సృష్టియెల్లఁ బ్రేమసిక్తము సృష్టికిఁ
గర్త వెలయుఁ బ్రేమమూర్తియగుచుఁ
దత్స్వరూపమందుఁ దనివందువారు గు
ర్తింపగలరు కడుపుతీపురూపు. 105

ఇది కడుపుతీపు

-------------

# విశ్వాసము

రాక బందరు; కదియును రైలు మీఁదఁ;
జేరె నా రైలు గుడివాడ స్టేషనుకును
ఎక్కువారును దిగువారు త్రొక్కటంబు
గూరుచుండిరి; నే నట్టె కూరుచుంటి. 1

ఏను గూర్చున్న పెట్టెలో నెడము గలదు;
వల దనుచు నెక్కవచ్చెడువారిఁ ద్రోచి
నాదరిని గూరుచుండిన చౌదరి యొకఁ
డరయు చుండె నిట్టట్టు నాగరకుకొఱకు. 2

కరకరని తెల్లవల్వలు: గనుల జోడుఁ
జేతబెత్తముఁ దాలిచి లేఁత వయసు
బ్రాహ్మణుఁ డొక్కఁ డెక్కనర్హ మగుచోటు
నారయుచు నుండె నపుడు ప్లాట్ఫారమునను. 3

అప్పుడు చౌదరి యాతని
చొప్పరసెన్, బిలిచె, నతఁడుఁజొత్తేనుండెన్;
గుప్పున వచ్చెన్ లోనికి
నుప్పరి యొక్కండు; ప్రక్క నొదికిలి నిలిచెన్. 4

చాలఁగాఁ జోటుగల దతఁ డేలొకాని
కూరుచుండఁ డప్పుడు వానితీరు సూచి
పాఱయును మట్టితట్టయుఁ బాఱఁ జూచి
తొలఁగి పొ మ్మని చౌదరి తొందరించె. 5

మూల నొదిగి నిల్చుందు; దండాలు బాబు,
ప్రక్కబండ్ల న న్నెవ్వరు నెక్కనీరు;
తిరిగి తిరిగి వచ్చితి నంచు దేవురించు
వాని నోదార్చి నే నిల్వ నాన యిడితి. 6

చే విసరి పిల్చెఁ జౌదరి; చేరె బ్రాహ్మ
ణుండు; నాతని ప్రక్కఁ గూర్చుండె; నపుడు
వెలి నిలిచి యొక్క వృద్ధుఁడు పలుకుచుండె
నభ్యనుజ్ఞఁ గాంక్షించుచున్నట్టు లిట్లు. 7

"ఇంట నిబ్బంది తీఱఁగానే స్వయముగ
వెంటఁ గొనివచ్చి నే దిగవిడుతునోయి!
చూడు నామాట" యని వృద్ధుఁ డాడుమాట
వింటి; "మీ రల్లు మామలా?" యంటి నేను. 8

"ఒక్కతే బిడ్డ. కనులముం దుండు ననుచుఁ
బెండ్లి చేసితిఁ బొరుగూరి పిల్లవాని
కీతనికి నిచ్చి; యుద్యోగరీతిచేత
నీతఁ డన్యదేశమ్ములనే వసించు." 9

అంచు నావృద్ధుఁ డెదొ వచియించుచుండె,
నల్లుని మొగమ్ము మటమట లాడుచుండె;
అట్టితఱి బిట్టుమొఱుఁగుచు నరుగుదెంచె
నుప్పరిని జేరఁగా నొక్క యూరఁగుక్క. 10

చూచి మూచూచి మునికాళ్ల లేచి యేచి
తోఁక నాడించుకొనుచుఁ దుందుడుకు తోడఁ
దన్ను నాకఁగా నాలుకఁ దడవుకొనుచు
ముక్కుచును మూలుగుచునున్న కుక్కఁ జూచి. 11

ఉప్పరి మొగమ్ము వెడతెల్విఁ దెప్పతిల్లెఁ;
దలుపుఁ దెఱచి దానికి గోము సలుపఁ దలఁచె;
దుమికి దుమికి లోనికి నది దూఁకఁ జూచె;
ధిక్కరించెఁ జౌదరి తల్పుఁ దెఱవకుండ. 12

మొఱుఁగుచునెయుండెఁ గుక్క; చీఁదఱగొనుచును
నాగలేక కోపమున నానాగరకుఁడు

చేతికఱ్ఱతో నా కుక్కమూతిమీఁదఁ
గొట్టె; నా యుప్పరిని జెడఁ దిట్టె మఱియు. 13

అంతలో గుఱ్ఱపుంబండి నమ్మగూఁతు
లరుగుదెంచి రిర్వురు; వారి నరసినంత
నల్లుని మొగమ్ముపయిఁ దెల్వి వెల్లివిరిసె;
మామ దిగులొందె, వచ్చితిరేమి? యనియె. 14

అత్త పలికెఁ దాళపుఁజెవిగుత్తి విడిచి
వచ్చితి రటంచు నల్లుతో; వగపు మఱపు
మురుపు మెఱపించు చల్లుఁడు మోవి గఱచి
కొనుచు జవరాలిమొగముఁ గన్గొనలఁ జూచె. 15

చుఱుకుచుఱుకుగా జవరాలు సూచెఁ, జూచె
మరలనాతఁడు, జవరాలు మరలఁ జూచె;
చూపు చూపు పరస్పరసూక్ష్మభాషి
తముల వివరించె వైద్యుతతంత్రులట్లు. 16

చూచుచుండిరి నలువు రీచోద్య మపుడు;
సూక్ష్మవేదనమ్మున మనస్సులు లగించె.
కుక్కగోడును నుప్పరి బిక్క యేడు
పెవరిమదికిని నెక్కనే యెక్క దయ్యె. 17

వాచ్యమునకంటెఁ జాతురి వ్యంగ్యమునకుఁ
బ్రబల మనుమాట నాకప్డు స్పష్టమయ్యె
వావిడిచి చేయుమొఱఁ జెవి వైచికొనక
కన్ను సన్నలే యెల్లరుఁ గాంచుకతన. 18

మామయులుకును, నల్లుని మోముకులుకు
తల్లి పయిపూఁతయును, గూఁతు జల్లి చేఁత,
ఆల్మగల నెయ్యపుంజూపు మేల్మితీపు
లరయు చొక్కింత నే నబ్రమందు నంత. 19

రైలు కదలెదు వేళయ్యె; నాలుమగల
జాలిచూపులు కన్నీళ్ల నోలలాడెఁ;
గుక్క మొఱ యెక్కువయ్యెను; బిక్క మొగము
వెట్టి యుప్పరి గుండెపైఁ గొట్టుకొనియె. 20

చూచినాఁడ నే నీ రెండుచోద్యములను;
రెండుపాయలై మనసు వర్తిల్లె నాకు;
ఈలమ్రోఁతయు, నంతలో రైలుకూఁత
తొట్రు గల్గించె; రైలును దోన కదలె. 21

కదలి రైలు ప్లాట్ఫారము గడచిసాగెఁ
దల వెలికిఁ జొన్పి యట్టె చూడ్కులు నిగుడ్చి
యువకుఁ డుప్పరియును జూచుచుండి రొదిఁగి
కూర్మియిల్లాలిజాడయుఁ గుక్కజాడ. 22

యువకుఁ డపుడు తన్ను నొంటిగ విడి దుఃఖ
పడుచుఁ దిరిగియేఁగు పడుచుఁ గనియె:
ఉప్పరీఁడు తన్ను నొంటిగ విడలేక
గ్రుక్కఁబట్టి వచ్చు కుక్కఁ గనియె. 23

దూఁకుచుండె రైలు తొందరగా దాని
తోడఁ గుక్కగూడ దూఁకుచుండె.
రైలుబండి ప్రక్కఁ గాలాప కాకుక్క
రాక మాకు నబ్బురంబుఁ గూర్చె. 24

అంతదాఁక వింత యైయున్న యువకుని
లీల మాకు మదులఁ దూలిపోయె:
అంతదాఁక రోఁత యైయున్న యుప్పరి
గోల మాకు మదుల నోలగించె. 25

రోఁజు చిట్లు కుక్క నూజెళ్ల స్టేషను
దాఁక రైలువెంట దూఁకి వచ్చె.
ఎదిరిరైలు నప్పుడే బందరున నుండి
చేరుకొనియెఁ బ్లాటుఫారమునకు. 26

ఉప్పరీఁడు రైలు తప్పించుకొని వెలి
కరుగ నెఱుఁగఁడయ్యె నిఱుకటమున;
రైలువాండ్రు కుక్క రానీక తఱిమిరి;
నాకు నంత పూన్కి లేకపోయె. 27

ఎదిరి రైలులోన నేతెంచుచున్నట్టి
మిత్రవితతితో సమేలములను,
అచటరైలు కదలు నందాఁకఁ బనిలేని
పనిని నేను గాలమును గడపితి. 28

ముందుగానె కదలె బందరు వచ్చు మా
రైల్, హుటాహుటించి రాఁదొడంగె;
నంతదాఁకఁ గొంత యాయాసమును దీర్చు
కొన్న కుక్క మరల వెన్నడించె. 29

కనుల నీరునించుఁ గనుఁగొంచు, నుప్పరీఁ
డెచ్చరించుఁ; గుక్క యెగిరి కొంచుఁ
బైకిరాఁ బ్రయత్నపడుఁ, గ్రిందఁబడుఁ, గొంత
దూరమగును, మరలఁ జేరుకొనును. 30

ఉప్పరీని నప్పు డోదార్చితిమి కుక్కఁ
జూచుకొనఁగఁ జక్కఁ జోటొసంగి;
చెప్పరోరి! కుక్క చొప్పును నీ చొప్పు
ననుచుఁ గనికరించి యడిగితిమి-ని. 31

ఒక్కకన్ను కుక్కప్రక్కకు, మఱియొక్క
కన్ను మాదుప్రక్కకు న్నిగుడ్చి
చెప్పఁదొడఁగె నప్పు డుప్పరి తన పడు
త్రిప్పు లల్లకుక్కమెప్పు లెల్ల. 32

"ఒప్పుకొంటిమి గుడివాడ యొద్దఁ గొంత
మట్టిపని; చేయుచున్నాము; తట్ట పాఱ

విడిచిపెట్టిన మాపొట్ట గడవదండి;
యుప్పరులమండి; లేదండి యుప్పుగంజి. 33

ఇల్లులేదండి; పదిమంది పిల్లలండి;
తల్లి గాలివానకు నేటి వెల్లువఁ బడి
నిరుడె చనిపోయెనండి; మాకరమమేమి
చెప్పనండి; మీ కెందు కీ చీఁదఱండి! 34

పెద్దవానగాలి బెజవాడ బందరు
దేశములను నిరుడు నాశపఱుచు
టెఱుఁగ రేమి బాబు! లీసీమ నీర్చిచ్చు
గొట్టి పైర్లు నేల మట్టమయ్యె! 35

వడిగ వచ్చిపడిన బుడమేటి వెల్లువఁ
జెల్లి పోయెనండి పిల్లతల్లి;
అప్పుడండి, చావుఁ దప్పించెనండి,యీ
దొడ్డకుక్క నాకు బిడ్డలకును 36

మనిషి బుద్ధికంటె మాదొడ్డ బుద్ధండి;
మసలదండి యెపుడు మమ్ము విడిచి;
వింత బాబు, దీని విశ్వాస; మెన్నని
చెప్పఁగలను దీని గొప్పపనులు! 37

కొంప గోడులేక కొంద్రలలోన మే
ముండఁగలమె దీని యండలేక;
చివ్వుమంచు లేచి చెర్లాడిచంపును
బందినైనఁ ద్రాచుఁబామునైన. 38

దానిగంజి ముందు, తర్వాత నాగంజి;
నేను దాని వీడలేను, నన్ను
నదియు వీడలేద యిదివఱ; కాకుక్క
ప్రాణమండి నాకు బాబులార! 39

కూలిడబ్బు తెచ్చుకొందును బందరు
వెళ్లి; నేను రాత్రి మళ్లి వత్తు;
గంజినూకకైనఁ గంట్రాక్ట రెప్పటి
కూలినప్పు డియక నాలిపెట్టు. 40

ఇచ్చునప్పుడైనఁ దెచ్చీఁడు: దండుగ
మంటిపనులు తనకు నింటికడను
జేయవలెను; మీఁదనేయిచ్చు; నందుకై
తట్ట, పాఱ వెంటఁబెట్టుకొంటి. 41

కుక్కఁ జక్కఁ బట్టుకొం దని పిల్లల
కప్పగించి దాని కందకుండ
నక్కి వచ్చి నేను తిక్కెట్టు కొనుకొంటి;
నెట్టకేల కిచట నెక్కఁగంటి. 42

ఎపుడు నన్ను విడిచి యెఱుఁగదు గావునఁ
గుఱ్ఱగాండ్ర దూసికొన్న దండి!
వచ్చెనండి నన్నుఁ బసిపట్టి; రైలొద్దఁ
దాఁకనైతి దాని గోఁకనైతి. 43

కొన్న తిక్కెట్టు చెడునని కొంతభయము,
కోపగింతురు మీ రని కొంతభయము,
కదలనీదయ్యె; నే రైలు వదలనైతి;
జాలిమాలితి; నాకూలి కూలిపోను. 44

కుక్క నాకు నింక దక్కునా, మా తండ్రి!
గుండెపగిలి నేలఁ గూలునేమొ?
పైన మాపి నాదు ప్రాణంబయిన వేఁపిఁ
బట్టుకొందుఁ గ్రింది తట్టు కుఱికి." 45

అను చాయుప్పరి కన్నీర్
దొనదొనఁ గాఱంగ నేల దూఁకంబోయెన్;

బెనుపూన్కి నాపి నేని
ట్లని చెప్పితి వాని కప్పు డాశ్వాసముగాన్. 46

కుక్కకై ప్రాణములను బోఁగొట్టుకొనకు;
నేలకుఱుకకు; నీ కుక్క నీకుదక్క
నవలి స్టేషను రాఁగానె యచట నీకుఁ
గొని యొసంగుదుఁ దిక్కెట్టు కుక్కకొఱకు. 47

అంటిఁ; బెట్టెలోని యందఱుఁ దత్కథ
నాలకించి యెంతో జాలిగొనిరి.
ఆదిఁ గసరుకొన్న చౌదరికన్నులు
చెమ్మరించె, నీరు గ్రుమ్మరించె. 48

కుక్కకు నీకున్ మఱురై
లెక్కన్ దిక్కెట్టుడబ్బు లే నిత్తును; నీ
కిక్కడ పీ రిత్తురు గద,
కుక్కను నీ వెంటఁ దోడుకొని పోగదరా! 49

అని యా చౌదరి మిగులన్
గనికరమునఁ బలికె; వాఁడుఁ గళవళ పడుచున్
గనుచుండెఁ గుక్క రాకన్;
గనఁగా లేనైతిఁ గుక్క కష్టము నేనున్. 50

ఒడలెల్ల నురుఁగు గట్టెను;
బడఁ బాఱుచునుండె; వెనుకఁ బడుచుండె; నిఁకన్
గడుదూర మైన నిటు పరు
గిడఁజాల దటంచుఁ దోఁచె నెల్లరమదికిన్. 51

చేర నున్నాము కొతరం స్టేష నింక
నొక్కమైల్ దూరమున నదియుండు నేమొ!
కలదు రైల్‌రోడ్డు కడ్డమై కాల్వయొకటి
దాని వంతెనపై రైలు దాఁటుచుండె. 52

కుక్క రైలుతో వంతెన నెక్కి దాఁటఁ
జోటులేదయ్యె; రైలెల్ల దాఁటు దాఁక
నిలువరాదయ్యె దానికి; నీట నుఱికి
యీఁది యీవలిదరిఁ జేరుకోఁ దలంచె. 53

కాల్వలోనికి నుఱుకుటఁ గంటి మేము;
కుక్క యీవలియొడ్డున కెక్కుజాడ
గానరాదయ్యె; రైల్ వచ్చెఁ గౌతరంబు;
గుక్కకొఱకని తిక్కెట్టుఁ గొంటి నేను. 54

ఐదునిమిషములయ్యె; రాలేదు కుక్క;
కూలె నా కొంప యని వాఁడు గోలపెట్టె;
నిల్వలేఁడయ్యె రైలులోఁ; గాల్వదరికి
వెళ్లిచూతు ననెన్; మాకుఁ గాళ్లు వణఁకె. 55

కొన్న తిక్కెట్టు నేనును, గొంతడబ్బు
చౌదరియు నీయఁబోఁ, 'గుక్క చచ్చె నేమొ
నీటఁబడి; నాకు నివి యింక నేటి' కనుచు
దిగులుగుండెలతో వాఁడు దిగెను రైలు. 56

"దిగితి నిప్పుడు; నే నింక దిగిననేమి;
దిగక చచ్చిననే; మది తీఱియుండు.
ఆడ గుడివాడ నన్ను వెంటాడినపుడె
రైలుదిగనైతి! నాకుక్కఁ గోలుపోతి! 57

కుక్క చచ్చెనేని కూలి నా కింకేల?
కుక్క లేక రైలు నెక్కఁజాల!
కుక్క నాకు దిక్కు: కుక్కకు నే దిక్కు!
దక్కు నాకుఁ గుక్క కొక్క దిక్క. 58

బాబులార! కుక్కతోఁ బోదు నే"నంచు
గుండెమీఁద బాదుకొంచు వాఁడు

తట్ట పాఱుమాట తలపెట్ట కొకపెట్ట
పరుగు వాఱెఁ గాల్వప్రక్క కపుడు. 59

దూఁకె రైలుతో సుదూరము, గుండెల
కధిక దుస్సహప్రయాసమయ్యె.
అట్టిదింక నీఁదు టెట్టులు? చలినీటఁ
బడినతోన గుండె పగిలెనేమొ? 60

పలికెఁ దనకుఁ బ్రాణప్రద మని యా కుక్క
నరయఁగల్గె నేమొ యాతఁ డచట?
ఉసురుతోడ నున్నదో లేదో? యది యుండ
కున్న వాని జీవ ముండఁగలదె? 61

నొచ్చుకొంటి నేను: - నూజెళ్లలో వాని
దింపనైతిఁ; గుక్కతిక్కటైన
విలిచి యీయనైతి; "విప్రులు పశ్చిమ
బుద్ధు" లన్న నుడి సుబద్ధ మయ్యె. 62

తీగ నేఁ గాల్వదరినైన లాగియున్న
నాగురైల్, కుక్కవానికి నబ్బియుండు.
కారణం బడ్డు నని గార్డుగారి కపుడు
వెఱచియుంటిని, దుది కొడు గఱచికొంటి. 63

తఱియయ్యె రైలు గదలెను
మఱి మామాపనుల మేము మసలితి, మైనస్
మఱపునకు రాదు, నా మది
నెఱవుకొనెన్ గుక్కగాథ నిత్యస్ఫూర్తిన్. 64



# దివ్య దర్శనము

(పద్యకృతి)



శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి

1926

# తొలిపలుకు

శ్రీ ప్రభాకరశాస్త్రి గారు రచించిన యీ 'దివ్యదర్శన' మనుకృతిలోని యితివృత్తము కల్పితముకాదు. 'నిజముపెంచి' రచించిన 'సత్కృతి' యిది యని రచనాప్రారంభమునుబట్టియే గుర్తింపఁగలము.

'బాల్యమునుండియుం గడు బ్రపన్నుఁడు', 'ఈశ్వరతత్త్వ భావనాలౌల్యమునం జెలంగు నకలంకుఁడు' నగు జిజ్ఞాసు వొకఁడు 'సచ్చిదర్థసాకల్యము దెల్పి యవ్యయసుఖం బొదగూర్చుగురుం గుఱించి యన్వేషించుట, తత్సందర్భమున సంశయము లనేకములు బాధింపఁగా 'పెద్దపెద్ద పండితులు స్వానుభవము లేని చదువులు వినిపించుట, 'తుదకు నమ్మందగ్గసన్మార్గమొక్కటి' గోచరింపఁగా నా మార్గమున నాతఁడు పయనించుట, దానం జిత్రమైనయనుభూతివిశేషములు నాతఁ డందుట యీ కథయందు ప్రవ్యక్తమైనది.

'చక్షుర్గోచర మైనయీ జగతికింజాలై యనేకాద్భుత ప్రేక్షాలక్షిత మెంతయేన్ గలదు. తద్విజ్ఞాన సర్వస్వమున్ లక్షింపం దగుశక్తి మర్త్యులకుఁ గల్గంలే' దనుట చేతను, 'వెన్నుంగానఁగలేని కన్ను లివి యీవిశ్వ ప్రపంచార్థపుం దెన్నుంగానఁగ నేర్చునే' యనుటచేతను దివ్యదర్శనము పొందుటకుఁ గావలసిన యోగ్యత ఫోర్తుడైమన్షన్ వర్కు జరిగిన తర్వాతనే మానవతకు లభించు నని తెలియ నగుచున్నది. అప్పుడే మానవత విజ్ఞానవిలసితమై నెలకొనఁగల దనియుఁ, 'జదువ మొదలిడిన యీ తాటాకు పుస్తకము' లోని యుత్తరకథావిషయములు లోకకల్యాణా వహములు కాగల వనియుఁ దెలియనగుచున్నది. కాగల కార్యమంతయు కాలగర్భమందే కల దని దీని భావము.

ఈకృతి 1924 సం॥ న 'భారతి' పత్రికయందు ప్రకటింపఁబడినది.

మిత్రుల కోర్కిపై పుస్తకరూపమున దీని నిట్లు ప్రకటించితిమి. ఇట్టివే శ్రీశాస్త్రిగారిలఘుకృతులను, మఱి కొన్నిటిని మున్ముందు ప్రకటింపఁగల మని యాశించుచున్నాము.

శ్రీ నిరంతరానందనిశ్రేయసార్థ
సాధకము సర్వకిల్బిషబాధకము స
మగ్రవిజ్ఞానదము మహామహిమఘనము
శరణ మగు మాకు సద్గురుచరణయుగము. వే॥ ప్ర॥

ముక్త్యాల ఇట్లు
20-5-54 ప్రకాశకులు.

# దివ్య దర్శనము

గురుచరణారవిందములకుం బ్రణమిల్లి తదీయసత్కృపా
భరపరిసంస్కృతంబులగు భావములన్ వెలయించి తత్త్వవి
స్ఫురణము లోకమందుఁ బరిపూర్ణము కాఁగలదన్న వేడ్క పొం
పిరిగొనఁ జెప్పెదన్ నిజము పెంచి సమించితమైన సత్కృతిన్. 1

కృష్ణవేణ్ణాతరంగిణి యంధ్రలక్ష్మి ని
        త్యతరంగతాండవం బాడుచోటు
భక్తులపాలి కల్పకశాఖి కనకదు
        ర్గాంబిక కాస్థానమైనచోటు
పాశుపతాస్త్రంబు భవునిచే విజయుండు
        ఘనతపస్స్ఫూర్తిఁ గైకొనినచోటు
బహుమహామహు లద్రిగుహలలో వసియించి
        నిర్వికల్పసమాధి నెగడుచోటు

ఆంధ్రభూనాభిదేశమై యలరుచోటు
నాఁడు నేఁడును సిరులఁ దనర్చుచోటు
పావనచరిత్రమును వ్రాలుఁ బ్రాలుఁ గల్గి
వెలయుప్రజతోడఁ గలదుగా విజయవాడ. 2

కొండలు నాల్గుప్రక్కలను గోడలనం గల వౌట వీట మా
ర్తండకరప్రతాప మెడతాఁకి సెగల్ నెగయించుచుండఁగా
మండెడు గాడుపుల్ ప్రజల మాడ్చెదునక్కట, యప్పురంబునం
దెండలకాలమందు వసియించుట దుస్సహ మెట్టివారికిన్. 3

నిండలే దిప్పటికి నేండ్లురెండు నట్టి
మండువేసంగి నట దుర్గకొండమీఁద
బడుగుబాపండు పసలేనియొడలివాఁడు
గాఢసంకల్పుఁ డొక్కండు గానవచ్చె. 4

అనాఁడు శుక్రవారము
గాన పురస్త్రీలు కానికలు గొని దుర్గా
స్థానికి వచ్చిరి కృష్ణా
స్నాన మ్మొనరించి యుదయసమయమ్మునకున్. 5

చక్కఁ బ్రొద్దెక్కలేదు కృష్ణాస్రవంతి
గ్రుంకులిడి పూలుఁ బండ్లును గొంచువచ్చి
రిర్గుపొర్గాళ్ళవారును దుర్గతల్లి
ప్రాతరర్చోత్సవముఁ జూచుకౌతుకమున. 6

కాషాయధరులు తాపస
వేషులు పౌరాణికులును వేదాంతులు శు
శ్రూషులు నుండిరి పరిపరి
భాషలవా రచటఁ గోరి భక్తిన్ భుక్తిన్. 7

"అమ్మ, పాలకుఁ బండ్ల కిమ్మ నేఁ" డని వేఁడి
యించు కించుక గడియించువారు
అభివాదపూర్వకం బర్థింపఁబడి భిక్ష
కరసి "నారాయణా" యనెడివారు
ఒడల బూడిద తలజడలు దాలిచి బూక
రించి బెట్టుగ సేకరించువారు
అడుగకే ధనభాండ మిడి చెంత నరమోడ్పుఁ
గనులఁ జూచుచుఁ గూర్చుకొనెడివారు

నయి కనకదుర్గ గుడిచెంత నంత నంత
సాధకులు గల రింకం, బ్రసాద మంచుఁ
దేరగా యాత్రికులు కొనితేరఁగా గ్ర
హించుచుండిరి కొందఱు పొంచి యుండి. 8

కల రీ తీరునఁ బెక్కుతోయములవార్ కార్యక్రమవ్యగ్రులై
యలనాఁ డక్కడ నొక్కఁ డా బడుగువాఁ డవ్యాపృతుండై సుని

శ్చలుఁడై యే వెడమాయముల్ గనక యుత్సాహంబొ దుఃఖంబొ యే
తలఁపో లోని దెఱుంగ రాని ముఖసందర్భంబునం గన్పడెన్. 9

చండభానుని కిరణముల్ కొండమీఁదఁ
దాఁకుటయు వెచ్చగాడ్పు లుద్రేకమందె
జాముప్రొ ద్దెక్కినదొ లేదొ జనులు వేగ
నెచటివా రచ్చటికి నేఁగి రచటనుండి. 10

పాలు ననఁటిపండ్లు వడపప్పు చలిమిడి
చెఱకుఁదుండ్లు తియ్యఁజిఱుగడములు
దొరకినంత కడుపుతొందర తీరగా
నారగించి రెల్లవారు నచట. 11

"తిండిమాట తలఁపఁ డెండ తీండ్రించె నె
వ్వారి నడుగఁ డింతవారి నేని
కడుపుమంట లేదొ యడుగ నెఱుంగఁడో
యేమికర్మమో యి దేమొ" యనుచు. 12

అందుం గొందఱు చేరఁగా నరిగి "యేమయ్యా. మహాగ్రీష్మమీ
చందంబై దహియించుచున్నది జగం; బాహారమో నీరమో
తిందుం ద్రావుదు నంచు నెంచ విదియేతీరోగదా యాత్మహ
త్యం దీఱం దలపోసెదేమి?"యని యత్యంతంబుఁబ్రశ్నింపఁగన్ 13

కన్నుల లేఁతనవ్వు తొలఁకం దల కొంచెము త్రిప్పి యాతఁడున్
మన్ననమీఱ వారికి సమస్తముఁ జెప్పఁదొడంగె "నాయనల్
నన్నుఁ గుఱించి మీరలు కలంకఁబడన్ బనియేమి? నాకు నే
నన్నముకోసమై జననమందితినా? యది నా ప్రయత్నమా! 14

నా యత్నంబున నాకు భూమిపయి జన్మం బబ్బఁగా లేద యి
ట్లైయుండం బ్రదుకాస నేమిటికి నే నాయాస మందన్వలెన్
పోయెంబో తను, వేల చింతిలవలెన్? పుట్టింపఁ బోషింపఁగా
మాయింపంగఁగడంగు నీశ్వరునియమ్మాహాత్మ్య మూహించెదన్. 15

పురుషకారమంచుఁ బూర్వకర్మ మటంచుఁ
జెప్పఁగలరు మీరు నిప్పు డెదియొ
ఇంపవయ్య నాకు నీకారమును గర్మ
మాది యేది దాని నరయుఁ డయ్య! 16

కాఁదగునందురేఁ బురుషకారము మీ రిట నేఁడు భుక్తిసం
పాదనకై ప్రయత్నపడుపట్టున నెట్టన నెంతవేఁడినన్
లేదనె నొక్కతల్లి, ముదలింపకయే యొకతల్లి పెట్టె నీ
మాదిరి వెన్నియెన్ని? నరమాత్రుని యత్నము నిష్ఫలం బనా! 17

కర్మము కర్మమం చొకటి కల్పనచేసెద రేమికర్మ మీ
కర్మము? దీనికిం బ్రథమకారణమే దది యొక్కటేకదా!
మీర్మతి మీరుమీరు నిటుమేద్పడుచుండఁగ వారువారు వార్
పేర్మి సుఖింపనేల? పలు భేదము లె ట్లుదయించె జెప్పఁడా! 18

పంద్రెండేం డ్లిటువంటిసంశయములే బాధింపఁగా నెన్ని యే
మంద్రాటంబులు గాంచితిన్ దొరకె నమ్మందగ్గసన్మార్గ మో
తంద్రుల్, సర్వము నీశ్వరేచ్ఛ నడపున్ దత్కృత్యముల్ గూఢముల్
కంద్రుంగానరు మానవుల్ తమ కహంకారంబు పైకొంటచేన్ 19

ఇట్లయి యుండఁ దిండికయి యే నని యే మని జీవితేచ్ఛచేఁ
బాట్లఁ బడన్వలెన్ ననుఁబ్రపంచమునన్ సృజియించె నీశ్వరుం
డెట్టును మీఁదికృత్య మతఁడే యెఱుఁగున్ జరుగున్ దదిచ్ఛయి
ప్పట్ల ననున్ క్షమింపుఁడిట ప్రాణముపోయిన నేమిపోయెడిన్. 20

కరుణామూర్తి జగత్కుటుంబి యతఁ డిక్కట్లన్ ననున్ ముంచునన్
వెఱ నా కింతయులేదు తన్మయత నేవేళం బ్రవర్తిల్లుదున్
మరణం బిప్పుడు తప్పదే నదియు సంప్రాప్తించు లేకున్నచో
దొరకున్ నాపరితోషహేతు విట మీ ర్దుఃఖింపఁగా నేటికిన్? 21

అనుటయు నంత.

"శాస్త్రవిరుద్ధ మీపలుకుచంద" మటంచును నవ్వి రందులో
శాస్త్రులు గొంద, ఱింక మొగచాటయి "యుక్తికి దూర మీవచో
విస్తృతి" యంచుఁ గొందఱు వివేకులు పల్కిరి; నిర్వికల్పుఁడై
నిస్త్రపుఁడై యతండు తననిశ్చయమే పలికెం బదింబదిన్. 22

నిప్పుల్ గుప్పుచునుండెఁ జండకరుఁ డెన్నేఁదిన్నవారయ్యు నా
తిప్పం గల్కినసాధకుల్ మఱియు నేదేఁ దిండి కల్లాడి, రే
పప్పో బెల్లమొ కొంత సంతనపడన్ భక్షించి నీర్ త్రావి "మా
యప్పా, నీ వెటు లుండఁగల్గితి" వటం చగ్గించి రాయెక్కటిన్. 23

చండదీధితి నడుమింట మండుచుండె
నీచెవినిగాడ్పు లాచెవి వీచుచుండె
మంగలములోని ప్రేలాలమాడ్కిఁ బ్రజలు
వేఁగుచుండిరి యా నాఁడు విజయవాడ. 24

భానుఁడు పశ్చిమాశ దిగఁబాఱుటయున్ మలునీడ దీర్ఘమై
కానఁగవచ్చె గాడ్పు లడఁగందొడఁగెన్ బనిపాట్లచోట్లకున్
బానిస లేఁగఁజొచ్చి రటువంటితఱిన్ గిరి నెక్కుచుండెఁ జం
ద్రానన యోర్తు చేత బరువైకల దామెకు నొక్కగంపయున్. 25

అరనరవెంద్రుక లల్లాడుచుండఁగా
 రిత్తచేతను జక్క నొత్తుకొనుచు
అడుగులు నులివారి వడఁకాడుచుండగా
 నాఁగి యించుక శ్రమం బార్చుకొనుచు

గంప చాఁకిట సంకటం పెట్టుచుండఁగా
 మార్చి రెండవప్రక్కఁ జేర్చుకొనుచు
చెమ్మట మోముపైఁ జిందాడుచుండఁగా
 నద్దానిఁ జెఱఁగుచే నద్దుకొనుచు

మెట్లపై నక్కడక్కడఁ జెట్లనీడ
బిచ్చగాం డ్రాఁకగొల్పఁగా నొచ్చుకొనుచుఁ
గొండపయి నెక్కి వేవేగ కొలనిలోనఁ
గాలుచే కడ్గికొని వంగి యా లతాంగి. 26

అసురుసురంచు వచ్చిన ప్రయాసము దీర్చికొనంగ లేదు దు
ర్గసముఖు మేఁగలేదు, పాడగాంచెను దా నలబడ్డ బాపనిన్
విసవిస జేరఁగా నరిగి వ్రేఁకపుగంపను దింపి పేర్మిపెం
పెసఁగ నమస్కరించి యిడియెన్ దనతెచ్చిన యప్పదార్థముల్. 27

అరఁబండిన జహంగీరు మామిడిపం డ
నాసపండును లంకదోసపండు
నారింజపండు పనసతొల లుడికిన
చిఱుగడపుందుంప చెఱకుఁదుండ్లు
చక్కెర కేళీలు చక్కెర తఱి వెన్న
గోదుమపిండి కృష్ణోదకంబు
సత్తుగిన్నెఁడు తియ్యఁజల్ల చెంబెఁడు తవి
దంబలి, పండ్లు కోయంగఁ గత్తి
బెడియకుండ నొత్తుపడకుండఁ జెడకుండ
నడుమ నెవరికంటఁ బడకయుండఁ
గూర్చి మూసి మోసికొని తెచ్చి దింపిన
గంపఁజూపె 'నారగింపు' మనియె. 28

పసపు నిగ్గులు నిండుపండువంటి మొగమ్ము
కుదురైననుదురు కుంకుమపుబొట్టు
కారుణ్యమయమైన కన్నుదోయి ప్రశాంత
లక్షణమ్ములు గల్గువీక్షణములు
పరమపాతివ్రత్య నిరతిఁ జూపెడురూపు
మహనీయతను దెల్పు మాటపొల్పు
అధ్యాత్మవిద్యారహస్యజ్ఞ మగుప్రజ్ఞ
యూర్జితం బగు దాతృతార్ద్రవంబు

ఇంచుమించుగ నలువదియేండ్ల వయసు
గలిగి యవతారమెత్తిన కనకదుర్గ
భంగిఁ బ్రత్యక్షమైన పుణ్యాంగనఁ గని
చకితులై రెల్లరు నతండు సంభ్రమించె. 29

మఱియు నాయమ యి ట్లనియె. 30

"నాయన! వేఱుసేయక కొనందగు నీయవి; గ్రీష్మతాప మీ
చాయల హెచ్చు; చల్లనిప్రసాద మొకింత భుజింపకున్న చోఁ
గాయము నిల్వ; దేమిటికిఁ గష్టములందెద? వీశ్వరేచ్ఛ దుర్
జ్ఞేయము తండ్రి! నీ యెదురఁ జెప్పఁగఁజాల ననుగ్రహింపుమా. 31

ఎఱుగ న్నేరర కాని యీశ్వరుఁడు తా నే మేమి కావించు న
త్తెఱఁగెల్లన్ మునుమున్న సూచనలచేఁదెల్పించు విజ్ఞాత్మకుల్
గుఱుతింపందగున ట్లెఱుంగుదురు గైకోవన్న! నాయన్న! యీ
చిఱుదిండ్లన్ నెలనాళ్ళదాఁక; నటుపైఁజేకూరునీకామ్యముల్". 32

అనుటయు. 33

కంపింపం దను వెల్ల, నిల్వఁబడి చక్కన్ మ్రొక్కి "మాయమ్మ! యీ
కింపాకుం గరుణింపవచ్చితివటే గ్రీష్మంబునం దిట్లు మ
న్నింపన్ వేఁడెద నేమనం దెలియకుంటిం, గొంటి,నీ భోజ్యముల్
గంపెండుం భుజియింతు" నంచుఁబలికెన్ గౌతూహలంబొప్పఁగన్. 34

అంత నయ్యమయు. 35

గోదుమపిండి వెన్న కలఁగూరిచి చక్కెర చేర్చి పెట్టె, నా
పైఁ దునుకల్ ఘటించి యిడెఁ బండ్లనుదుండ్లు, నొసంగెఁజిగ్గడం
బాదట మజ్జిగం గలిపి యంబలి యిచ్చెను, జల్లనైన కృ
ష్ణోదక మంతఁ ద్రావనిడె, నూడెడుప్రాణము కూడఁ బాఱఁగన్. 36

ఎప్పుడు భుజించెనో యాతఁ డింతకుమును
కడుపువెన్నంటె నోర్ తడఁబడుచునుండెఁ

దృప్తిగా నప్పు డాయమ్మ తిండిపెట్టి
మక్కళించెను గడుపు, నో ర్వక్కణించె. 37

ఎక్కువున్న పండ్ల ముక్కల నచటికి
వచ్చియున్న వారి కిచ్చె నామె
వారు దాని నమ్మవారిప్రసాద మం
చందుకొనిరి, కనుల నద్దుకొనిరి. 38

పుణ్యకాంతను దేవతాబుద్ధిఁ దలఁచి
యచ్చటివిశేషముల కాత్మ తీచ్చగుడిచి
బడుగుబాపనిఁ దలపోసి నుడుగు లుడిగి
తెల్లమొగ మైరి యచటివా రెల్లవారు. 39

"నా తండ్రి; యనుదినము నే
నీ తెఱఁగునఁ దెచ్చియిత్తు నెది యేని శరీ
రాతంక ముడిపికొనుమీ
మాతృనిదేశంబు దీని మార్పుఱుపకుమీ. 40

సందేహింపకుమన్న! నీ కొఱకునై సాపా టిదేపాటి? మా
కుందైవ మ్మొకయింత భుక్తి కొసఁగెన్; గొంపోదుమే సంపదల్?
తిందుం బెట్టుదు; మూటకట్టుఫల మేదీ యింతకంటెన్; మహా
నందంబై నది తండ్రి! నిన్ గనుఁగొనన్ నా మాట పాటింపుమా." 41

నా, నాతండు నమస్కరించి "జననీ! నా భావిసౌభాగ్యసం
ధానం బిప్డె భవత్కృపాకలనచేతం జేతఁ జేకూరిన
ట్లానందం బిడెనమ్మ! నమ్మఁదగు నీ యాశ్చర్యచర్యన్ సమా
ధానంబందె మనమ్ము నమ్ముము భవద్వార్తం బ్రవర్తించెదన్. 42

ఎండలు మండుచున్నవిగదే! సెగదేరెడు కాఱుబండలన్
గొండల నెక్కి యన్వహము కూడదు నీ వరుదేరు టమ్మరో!
తిండికి సంజవేళ కరుదెంతును దప్పక చెప్పు మమ్మ మీ
యుండెడువీథిపేరు గృహముండెడుతీరును వచ్చి చేరెదన్." 43

అనుటయు నంత. 44

"కొండదిగి తూర్పువీథిని
గొండొకచన నొక్కసందు కూడును దానన్
రెండవయిలు మండువతో
నుండునదే" యంచు నామె యొప్పంజెప్పెన్. 45

అంతకంటె నధిక మామె వచింపలే
దతఁడు నంతకంటె నాడలేదు
వారికనులఁ గని రెదోరహస్యముఁ జెప్ప
కొన్నచంద మచట నున్నవారు. 46

దుర్గాప్రసాదవతి యని
పేర్గల దాయమ్మ కాడ బెజవాడపురిన్
మార్గస్థులు భక్తులు నయి
దార్గురు భుజియింత్రు ప్రత్యహము వారింటన్. 47

అరుణోదయమునఁ గాల్యక్రియల్ ముగియించుఁ
గృష్ణవేణ్ణాజలక్రీడ నెఱపు
తటితోడ నుదయసంధ్యాప్రార్థన మొనర్చు
నిర్వికల్పధ్యాననిరతి నెఱపు
జాముప్రొద్దెక్క దుర్గామంటపముఁ జేరు
నాసాయ మచ్చో నుపాస్తి నెఱపు
ఆహార మొసఁగు నయ్యమయింటి కరుదెంచు
సంభాషణమును భోజనము నెఱపు
రాత్రిపదిగడియలకుఁ బర్వతము నెక్కు
మెలఁకువున్నంతదాఁక నేమే జపించు
నెంచు దినములు నెలదాఁటు టెప్ప డంచు
బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁ డా బ్రాహ్మణుండు. 48

చచ్చిన నేమి చత్తును విచారములే దని తొల్త హెచ్చుగా
గచ్చులుగొట్టినట్టిబడుగం డటె! సాధ్వి యొకర్తు భోజ్యముల్
తెచ్చియిడన్ భుజించెఁ, బఱతెంచు భుజించుట కామెయింటికే
నిచ్చలుఁ దా నటం చవగణించుట తప్పిది యాలకింపుఁడా! 49

ఎవ్వఁడొ యాతఁ, డచ్చటికి నేటికి వచ్చెనొ, యొల్లనన్న వాఁ
డవ్వనితాలలామ మిడినట్టివి యట్టె భుజించుటెట్లొ, యా
యవ్వయు నెవ్వగం దలఁప కాతని కోయిర మేలతెచ్చెనో;
యెవ్వరు గుర్తెఱుంగ రిది యెంతయువింత యొకింత చెప్పెదన్. 50

బాల్యమునుండియుం గడుఁ బ్రపన్నుఁడు నీశ్వరతత్త్వభావనా
లౌల్యమునం జెలంగు నకలంకుఁడు నాతఁడు సచ్చిదర్థ సా
కల్యము దెల్పి యవ్యయసుఖం బొడఁగూర్చుగురుంగుఱించి చా
పల్యమునన్ జరించె నట భారతవర్షము పెక్కువర్షముల్. 51

అద్వైతమతము సాక్షాద్విరుద్ధము దీని
        కిది విశిష్టాద్వైతు లిష్టపడరు
ద్వైతు లిట్లు వచింతు, రీ తీరు బాదరా
        యణసూత్రఫక్కికి నన్వయింప
దుపనిషదర్థ మిట్లు పరిస్ఫురించు. వి
        ద్యారణ్యు లిట్లు భాష్యము రచించి
రిందు మాగురు లర్థ మిట్లు కల్పించిరి
        పలువురు దీనఁ దప్పులు గడించి
రంచుఁ బెదపెద్ద పండితుల్ స్వానుభవము
లేని చదువులు వినుపింపఁ బూని రెందు
నెందుఁగాంచిన నతనికి సందియంబు
డిందు పడదయ్యె.హెచ్చయ్యెఁ గొందలంబు. 52

పలుమతములుఁ బలుదగవులుఁ
బలుసిద్ధాంతములుఁ బూర్వపక్షము లింకం

బలుసందేహమ్ములు గల
పలువురఁ గని యతఁడు మిగుల పరితాపించెన్. 53

కటకటా! జగమెల్లఁ గటికిచీకటిలోనఁ
జీకాకుపడుట కేమో కతంబు?
పట్టుచిక్కకపోవు టెట్టొకో యిద్దాని
యాదికారణ మెట్టిదౌనొ కాని?
ఇదమిత్థ మని నిశ్చయింపఁగా సత్యప్ర
కాశ మించుకయేని కానరాదె?
ఈశ్వరుం డొక్కరుం డెసగుచున్నాఁ డందు
రది యేమి యనృతమా! హా! మతేమి?
పుట్టుపూర్వ మేమొ? గిట్టినపర మేమొ?
నడిమి మూడునాళ్ళ నటన మేమొ?
దేశకాలముల స్థితిగతులు నేమొ? నే
నేమొ? యింక సర్వమేమొ? యేమొ? 54

వెన్నుం గానఁగలేనికన్ను లివి యీ విశ్వప్రపంచార్థపుం
దెన్నుం గానఁగనేర్చునే? కటకటా! దేవాధిదేవుం డొకం
డున్నాఁ డన్నిటి కాదిమూల మతఁడేదో కార్య మూహించి యీ
యన్నింటిన్ సృజియించె నందు రది యట్టియుండు టెట్లోగదా! 55

ఈశ్వరుఁ డొక్కరుండు కలఁడేయని యొప్పినయప్పు డాతఁడున్
నశ్వరుఁ డౌనె యజ్ఞుఁడగు నావలెఁ, గాక యనంతశక్తియున్
శాశ్వతుఁడేని తత్కృతియు శాశ్వతమై విలసిల్ల కేటి కీ
విశ్వము నశ్వరంబయి యవిజ్ఞతతో వెత లందఁగావలెన్. 56

తలఁపఁ దలంపఁగా మది వితాకు జనించు జగమ్ము లీగతిన్
గలుగుట కేమి కారణమొ? కల్గుఫల మ్మది యేమొ? దీనికిం
దొలుతటియున్కి యెట్టిదియొ? తుట్టతుదం గనునో? యనేక రీ
తులు తులకింప హేతువునెదో? యెదియెట్టిదొ? యేమికర్మమో? 57

బ్రతికినచో లభియించెడి
ముద మేమో? చచ్చినంతఁ బోయెడి దేమో?
తుద యేమో? మొద లేమో?
యెది యేమో తెలియలేక యేఁకరు టయ్యెన్. 58

మోహ మిది తొలఁగకుండిన
చో హానికి వెఱవ నేల? సుఖపడ నేలా?
దేహాభిమాన మేలా?
ఆహారం బేల? ఏ ప్రయత్నం బేలా? 59

అని యప్పటికిఁ గొన్ని నాళ్ళనుండి కఠోర నియమమ్మునఁ దదేక తానుఁడై తపించుచున్నవాఁ డతఁడు పలుదడవలు స్వప్నములం "దిట్టి బెట్టిదపుఁబట్టుదల విడువుము. నాతిచిరకాలమ్మున నీ సంశయమ్ములు సమయఁగలవు. లోక కల్యాణము చేకురగల" దని స్ఫటికసచ్ఛాయస్వచ్ఛవిగ్రహం బొక్కమహనీయమూర్తి విబోధించుచుండ నయ్యది నిరంతర స్వచింతన సంస్కారజనిత స్వప్న సామాన్యలక్షణమ కాఁ దలంచి యవగణించుచుండె. మఱియు నా యా స్వప్నములందు సందృష్టము లగుచుండు విషయములు కొన్ని పిదప జాగ్రద్దశఁ బ్రత్యక్షము లగుచుండుటయుఁ జూచుచుండెఁగాని యపరిస్ఫుటము లగునట్టియనుభవముల నతఁడు సరకుగొనకుండె.ఇట్లుండ నక్కొండఁ జేరునాఁటికి మూఁడునాళ్ళకు ముం దొక వివిక్తస్థలంబున నిరాహారుఁడై కనులు మూసికొని తదేక చింతతో ధ్యానించుచున్నెడ. 60

శీర్షంబు తగ బిగించినయట్లు గనుపట్టె
ఫాలభాగమునందు బరువుదోఁచె;
భ్రూమధ్యమున నెదో మోపెట్టినట్టయ్యె
నెదురఁ గన్పడె వెల్గు చెదరిచెదరి;
సుళ్ళువాఱుచుఁ జతుష్కోణమ్మగుచు మెర్గుఁ
దీవ లిట్టటుఁ గొంత దిరుగఁజొచ్చె
నిశ్చలంబయి యంత నిల్చెఁ దెల్లనిపట్టు
తెరగట్టినట్టు జ్యోతిష్ఫలంబు;

అందు బంగారు రాపాడిఁ బొందుపఱిచి
నట్టు దివ్యాక్షరములు గన్పట్టె బంతి
గట్టి విస్పష్టముగఁ జక్కఁగాఁ దళత్త
ళద్ద్యుతులు గన్నులకు సురాళమ్ముగొలుప. 61

"స్వప్నసాక్షాత్కారమును సంశయించితివి. పరిమితశక్తియగు నీ కన్నుమమ్ముఁ గనఁజాలదు. నీ వలె నెందఱో కావలె ననువా రున్నారు. లోకకల్యాణము చేకూరనున్నది. శరీరహింస చాలింపుము. విజయవాడకు వెడలుము. కనకదుర్గగుడికడ జ్యేష్ఠము చెల్లించుము. ఒక్క పుణ్యాంగన నీ కక్కడ భోజనమిడును. భుజింపుము. మాయంశ మగు కనకదుర్గ నీకుఁ బ్రత్యక్షమై కాఁగలది తెలుపును. శుక్రవారము నిశాముఖమునఁ జూడగలవు. ఇదే బెజవాడ; కొండ; దుర్గగుడి; ఆహార మిడునామె సందర్శింపుము." అని యీవిధమున నాయక్షరము లుండెను. బెజవాడనగరము, పర్వతము, దుర్గాలయము చక్కఁగాఁ గానవచ్చెను. భోజన మొసఁగుపుణ్యాంగన పంచ్లగంపతోఁ బరిస్ఫురించెను. దీని కావల దివ్యద్యుతితో "ఆదిమూర్తి" అని చేవ్రాలుండెను. కొన్ని నిమిషము లివియెల్లను నాతఁడు తేఱిపాఱఁ దిలకించెను. అంత నాతనికిఁ దల తిరిగెను. మేను గగురుదాల్చెను. కను లున్మీలితము లయ్యెను. చూడగాఁ జేరువ నొకపాఱుఁడు పారమార్థికకార్యతత్పరుఁ డిట్లు ప్రార్థించుచుండెను. "ఆర్యా! నిరాహారవ్రతమున నీబోటి మహనీయుఁ డిక్కడ నవయుట పాడిగాదు. విజయవాడ కొండపయిఁ బలువురు తపసులు ప్రతివసియింతురు, తొల్లి అర్జునుండు తపమాచరించి యిక్కడ శివునిచేఁ బాశుపతాస్త్రంబుఁ బడసె నని ప్రఖ్యాతికలదు. తపస్సిద్ధిప్రద మాస్థల మని వినికి. కనకదుర్గ ప్రత్యక్షదేవత. ఇచ్చగింతురేని నేనును వచ్చి మి మ్మక్కడ విడుతును. విచ్చేయుఁడు. అంత వింతంబడి విస్మితుఁడై యాతఁ డాతనితో బయల్వెడలి యక్కొండకు వచ్చి చేరెను. ఆ నాఁ డక్కడ కనులకు గానవచ్చినట్లే బెజవాడకొండ, దుర్గాలయము, పుణ్యాంగన యీనాఁ

డిక్కడఁ గాననచ్చుట కాతఁ డచ్చెరువడెను. దైవలిఖిత మది తప్పక జరుగు నని తృప్తి చెందెను. అద్దుపలుకఁజాలఁడయ్యెను. ఆహార మారగించెను. ఇంక నాపుణ్యాంగన భోజనపదార్థములను గొని తేరఁ గల్గుటగూడ నెట్లో యెఱుఁగఁదగును. ఆమె పరమభక్తురాలు. విజయవాడకు విచ్చేయుమహనీయుల నామె వెదకి గుర్తించి తఱచుగా నాతిథ్యసత్కారములు వెఱపుచుండును. 'రే పాక మహనీయుఁడు నా కొండపై నిరాహారుఁడై వచ్చి నిలుప నున్నాఁడు. ఈజ్యేష్ఠాంతమున కాయన యిష్టసిద్ధియగును అయన కందాఁక నాహార మర్పించుచుండుము" అని యామెస్వప్నమున దుర్గాదేవిచే నిబోధితయై నాఁ డ ట్లాహారముఁ గొని వచ్చెను. ఇదియు పూర్వవృత్తాంతము. 62

చేరెం దొల్తటిశుక్రవార మతఁ డా క్షేత్రంబు జ్యేష్ఠంబునన్
బై రానుండినమూడువారములలోఁ బ్రత్యక్షమౌ టెప్పుడో
యే రీతిం గనుఁగొందునో యపుడు నా కేమేమివిజ్ఞానముం
గూరంజేయునొ దుర్గతల్లి యనుచుం గొండంత యుప్పొంగుచున్. 63

లెక్కించుచుండ నాతని,
క క్కొండన్ జనియె నిర్వదైదుదినము లిం
కొక్కటియె శుక్రవారం
బెక్కువ యాసించునది యదే చనుదెంచెన్. 64

తప్పకుండ నాఁడు దర్శన మిచ్చు దు
ర్గాంబ తన కటంచు నమ్మె నతఁడు
వేచె వేచెఁ గన్ను వేఁదుఱుగొని యర
వాయి లేక కొంత రేయిదాఁక. 65

"చీకటితప్ప మతేమియు
నాకంటికిఁ దోఁప దిచట నా తల్లియు నా
రాక కెదు రెదురె చూచుచు
నాకంటిక నవయుచుండు" నని యళ వెడలెన్. 66

నా(డు స్వర్ణాక్షరములు గన్నా(డు బ్రహ్మ
పదము చెందినయంతగా ముదముచెందె;
నే(డు తనయాన వీడుకొన్నా(డు నరక
లోక మందినయంతగా శోకమందె. 67

ఓ! విశ్వేశ్వర! యో పరాత్పరతరా! యో సర్వనిర్వాహకా!
దేవా నా పరిదేవితంబులకు నేదీ తగ్గ ప్రత్యుత్తరం?
బువిళ్ళూర్చితి వాసగొల్పితివి, యేమో యేమొ యత్యద్భుత
శ్రీవిస్ఫూర్తులు తో(ప(జేసితివి తత్సిద్ధిన్ విడంబింతువా? 68

నాచిత్తంబు పరీక్ష చేసికొనుచున్నా(డన్ యథార్థంబుగా(
బో(చంత్తైనను దుష్ప్రవర్తనము దుర్బోధం బెఱుంగన్ బవి
త్రాచారంబున బ్రహ్మతత్త్వపరమార్థానందముం గూర్చి యా
లోచింతుం బలవింతు( జంతిలుదు నేలో నన్ను వంచించుటల్. 69

"క్షిప్రతలోకశోక మడ(గింతును మిమ్ము సముద్ధరింతు" నం
చప్రతిమద్యుతిస్ఫురణ నక్షరరూపమునన్ ననున్ బ్రబో
ధప్రతిపన్ను( జేసి పరితాపము వాపి యి దేమి మోసపుం
గొప్రము పెట్టి తిప్పు తలకుం గడకుం జగదేకనాయకా? 70

నాసంకల్పము లేను గన్గానినవింతల్ సుంతయేన్ దోష మా
యా సంసర్గము లేని వేయగుట తథ్యం బంటకున్ మన్మనో
వ్యాసంగంబును బుణ్యసాధ్వి మఱియయ్యైచోటులున్ సాక్షులిం
దే సందేహముకల్గ(జేసితివి యింకేమందు నో యీశ్వరా! 71

దుస్సంకల్పముచేత నీ కన్నృత మేదో చూప(గా(బోలు ర
క్షస్సో యింక మఱేదొ యంచు నెవరేన్ సందేహమందన్ మనం
బుస్సూరంచు( దపించెడున్ గటకటా! యొందేమి బెండైనదే
నిస్సామాన్యమహానుభావమగునీనిర్వాహ మో యీశ్వరా! 72

"నీ వేమోతలపోయుచుంటి వదియే నీకన్నులందో(చె భ్రాం
త్యావిష్టుండవు గుర్తెఱుంగ" వనుప ల్కంగీకరింపందగున్

నా వైక్లబ్యముచేతఁ గల్గిన దటే నా తండ్రి! యానాఁడు ధ్యా
నావిర్భూతము దివ్యదర్శనము! మిథ్యార్థంబు లట్లుండునే? 73

ఆశ్చర్యంబుగఁ దోఁచె విద్యుతులు చెర్లాడెన్ విచిత్రంబుగా,
నైశ్చల్య మ్మొదవెన్ ద్యుతిస్థలికి స్వర్ణచ్ఛాయముల్ దాన న
త్యాశ్చర్యంబుగ నక్షరంబులును నయ్యెస్థానముల్ కన్పడెన్,
పశ్చాద్దృష్టము లిందుకున్ సరిపడెన్, భ్రాంతత్వ మిం దేదియో? 74

కలఁడు కలండు సృష్టికిని గర్త మహాద్భుతశక్తిమంతుఁడన్
దలఁపున నింతదాఁకఁ బరితాపముఁ జెందుచునుంటి నయ్యయో!
కలఁడు కలం డనంబడెడు కర్తయొకండు కలండొ లేడొ! హా
తలఁచిన హృత్పుటంబు శతథాపగులున్ దుద కెంతమోసమో! 75

అంచుం బలవించుచుఁ జను
దెంచె నతం డంతఁ గొండదిగి యా నాఁడీ
వంచనఁ బడి మది నెదియుం
గాంచం డయ్యెన్ భుజించుకాలము దాఁటెన్. 76

శుక్రవారం బగుట నేమొ శుభ్రవస్త్ర
భూషణమ్ములు దాల్చి యప్పుణ్యకాంత
భక్ష్యభోజ్యంబు లాయత్తపఱచి యెదురు
చూచుచుండె నాతం డటచొచ్చుటయును. 77

"కడపటి శుక్రవార మవుఁగావునఁ దప్పక దేవిదర్శనం
బిడియెడు నేఁ డటంచు మది నెంతయు సంతసమంది యప్పముల్
వడలును బాయసం బెదియొ వండితి నయ్యవి చల్ల నారెడున్
గడుఁ దడవయ్యె వేగ మడికట్టుకొనంగదవయ్య! నాయనా" 78

అని యామె పలుకుటయు నాతఁడు;

తల్లీ! వందనమమ్మ! నా కనినవింతల్ నన్ను సంతోషపుం
గల్లోలమ్ముల ముంపఁగాఁ గనకదుర్గం గాంచెదన్ బ్రహ్మత

త్యోల్లాసంబునఁ దేల్చునామె ననునం చున్నాఁడ ని న్నాళ్ళటం
బొల్లైపోయెను నేఁటి కేటికిఁక నీ భుక్తిం బ్రసక్తింపఁగన్? 80

తల్లీ! వందనమమ్మ! యొక్కనెలగాఁ దంటాలు నాచేతఁ బా
టిల్లెన్ నీకును. నేఁటితోఁ గడుపునిండెన్ దిండి నా కేటికో?
యెల్లన్ శూన్యము: సత్పదార్థ మొకయింతే లేదు లోకమ్మునన్
గల్లల్ పొల్లలు; లేఁడ యీశ్వరుఁడు; దుర్గాదేవి లే; దమ్మరో! 81

ఇట్లనుచుండ. 82

"ఆడకుమాడ కింకఁదనయా! యనయార్థము; లాగుమాగు; ము
న్నాఁడు జగన్నియంత పరమాత్ముఁడు; తత్కళ దేవి దుర్గ యుం
గూడ నెసంగుచున్నది; యగోచర మీశ్వరశక్తి; చూచియుం
జూడక నీ వెదోపలుకు చుంటివి తన్మహిమానభిజ్ఞతన్. 83

అగులే నా కంటికి ని
ష్ఠగపడ లేదందు: వింత యాహారింపం
దగు; నింత విశ్రమింపం
దగు; నవకాశంబు లేదొ తథ్యము దెలియన్. 84

చక్షుర్గోచర మైనయీజగతికిం జాలై యనేకాద్భుత
ప్రేక్షాలక్షిత మెంతయేన్ గలదు తద్విజ్ఞానసర్వస్వమున్
లక్షింపన్ దగు శక్తి మర్త్యులకుఁ గల్గన్ లేద, యద్దానఁ బ్ర
త్యక్షంబైనది నీ కొకింత, యట మాటై యింక నే మున్నదో! 85

కానన్ రా దనె దామె నీయెదుర సాక్షాత్కారమై నిల్చినన్
గానంగాఁదగుశక్తి యున్న దటె నీ కందోయికి న్నాయనా!
ఈ నాఁ డింకను జాము రేయరుఁగలేదే? నీకుఁ జేకూరు న
య్యానందమ్ము నిజమ్ము భోజనము చేయన్ లెమ్మున్ నమ్ముమీ!" 86

అంచు నప్పుణ్యసాధ్వి యుత్కంఠ నుద్దీపింపఁజేయుపలుకులు
ప్రాభవంబుదోఁపఁగాఁ బలుకుటయు నాతండు చూతముకదా
యనుచు మాఱాడనేరక భోజనమ్మున కంగీకరించె. 87

అమృతప్రాయములైన భక్ష్యములు భోజ్యంబుల్ ఫలంబుల్ మన
శ్రమ మల్లంతనె చల్లనారునటు లాసాధ్వీలలామంబు నె
య్యముతో దియ్యముతో వినోదములు మాటాడించుచుం బెట్టె నా
సమయం బేమివిచిత్రమో యతనికిన్ సంతోషముం గూరిచెన్. 88

కుడిచినతోడనె నిద్దుర
పడఁద్రోచెన్ జూచె నామె "పవళింపుమి యి
క్కడనే నేఁ" డనుచుం దల
గడగా నొకమూట చక్కఁగట్టి యొసంగెన్. 89

ఈయం గైకొని యాతం
డా యింటియరుంగుమీఁద నటె శయనించెన్
మై యెఱుగఁడు నిద్దురలో
"నాయన! నాయన!" యనన్ విని౦డి లేచెన్. 90

లేచెన్ స్త్రీవిగ్రహముం
జూచెన్ సంతోషపరవశుండై యట ప్రా
ణాచారము పడి స్తుతికిన్
వాచారంభణముచేసె వాంఛాపూర్తిన్. 91

ఆమె మొఱపెట్టు "నిదియేమి యన్న! యి ట్టు
పక్రమించితి వాఁకంట బడలియొక్కొ
ఓగిరముతోడఁ గొండపై కేఁగి చుట్టి
చుట్టి నినుఁగాన కిదె వచ్చుచుంటి నన్న! 92

ఎంతకు రావైతివి నేఁ
డింతాలస్యమ్ముకత మ దేమో యని వి
భ్రాంతి ఫలాహార మ్మిది
సంతన కట్టుకొని కొండచాయకుఁ జనితిన్." 93

అంచు నయ్యమ వివరింపఁ గాంచికూడ
వీడఁ డాపట్టు మఱి యిట్టు వేఁడఁ దొడఁగె

"తల్లి! దుర్గాంబ! నీడూపు దాఁచి వచ్చి
తమ్మ! యెఱుఁగుదు ని న్నేను నమ్మ నమ్మ. 94

దేవీ! యీవిధ మేలచేసెదవు? సాధ్వీమూర్తిఁ బ్రత్యక్షమై
యీ వీఱిండిఁ బరీక్ష చేయఁదలఁతే యేమమ్మ! యాహార మా
హావుట్టం దగఁ బెట్టె నిప్పుడెకదా మాయమ్మ లో నుండెడిన్
"రావమ్మా"యని పిల్వ వెల్వడును దుర్గాయమ్మ మా య మ్మహో 95

అనుటయు; 96

ఎట్టెట్టూ! భుజియింపఁ బెట్టినటె యిం దే తెంచి యాతల్లి నీ
వట్టే యేలఁగొఱుంగ నేరవయి తన్నా!" యంచు లోఁజొచ్చి క
న్గట్టం గాంచెను గాంచనోజ్జ్వలము లెన్నో గిన్నె లాసాధ్వియఁ
దట్టుండున్ వెసఁజొచ్చి దీపముకడన్ దర్శించె దద్రూపమున్. 97

గమగమ వలిచెడు పలుభ
క్ష్యములుం గనె గిన్నెలందు సాధ్వి, యతండున్
భ్రమితుండై యేమియుఁ దెలి
యమిఁ దెల్ల మొగంబువెట్టి యట్టే నిలిచెన్. 98

"కనకదుర్గాంబ నీకు దర్శన మొసంగెఁ
బండె నీ భాగ్య" మని యామె ప్రస్తుతించె;
"శుద్ధమూర్ఖుండఁ జూచియుఁ జూడనేర
నైతిఁగా" యని యాతండు కాతరించె. 99

వాయికివచ్చినట్టుగ నవాకులు పల్కితిఁ దొల్త నన్న దే
దోయది "వందనం" బనెడిదుండఁగ, దుండగమే సమస్తమున్
మాయమొనర్చె నన్నుఁ దియ్యమాటలఁ దియ్యనిపిండివంటలన్;
హేయము నాయకార్య;మిపు డెక్కడరోయుదు నేమి చేయుదున్. 100

అంచు నాతండు పరిపరివిధమ్ములం బరితపించుచుండ నాయను
యి ట్లనియె. 101

"సంతోషింపవనా! స్వహస్తమున నాసాక్షాన్మహాదేవియే
సంతర్పించెను దివ్యభోజ్యములతో సందర్శనం బిచ్చె నీ
కంతేచాలును నాకుఁ జేకురె నటయ్యా! కొండచుట్టుం బరి
భ్రాంతిం బొందుటతక్క జక్క గృహమం దాయమ్మ వేంచేయఁగన్. 102

ఆరగింపఁబెట్టె నంతెకా కింక నీ
లేదె నీకు దేవి యేదియేని
చక్క సంస్మరించి సర్వ మప్పటికథ
నుడువు" మంచు నామె యడుగ నతఁడు. 103

"తలక్రిందఁ బెట్టుకొను మని
తలగడ యొక టిచ్చె" ననుచు దానిం దెచ్చెన్
వెలుఁగునఁ జూడఁగ నందుం
గల దొక తాటాకు పుస్తకము గుప్తంబై. 104

అచ్చెరువడి యుద్దానిన్
విచ్చి కనుంగొనిరి వర్ణవిన్యాసము లో
నచ్చొత్తినట్టు కనులకు
ముచ్చటఁ గల్పించెఁ జదువ మొదలిడి రంతన్. 105

ఇది పూర్వకథ



## విన్నపము

శ్రీచంద్రమౌళీశ్వరులకు ఉపాయనముగా ముప్పదియేండ్ల క్రితము శ్రీ ప్రభాకరశాస్త్రిగారు రచించిన ప్రకటించిన ఈ యలతి కృతి 'కపోతకథ' ను హైదరాబాదు ఉస్మానియా యూనివర్శిటీ వారు మూడుసంవత్సరముల డిగ్రీ కోర్సునకు పాఠ్యగ్రంథముగా పెట్టుటచేత, వారమురోజులలో త్వర త్వరగా ముద్రణము ముగించవలసివచ్చినది.

దైవ సంఘటన యేమిటోగాని ఈ గ్రంథము రెండవ ఫారము ముద్రణ మగుచుండగా శ్రీ చంద్రమౌళీశ్వరులు (1873 - 1956) దివంగతులైరి.

ఆనాడు ఈ గ్రంథ రచనావశ్యకతనుగూర్చి శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వారి తొలిపలుకులో చెప్పియేయున్నారు. ఈ కృతిలో నంతర్గర్భితమైయున్న ప్రశంస, శ్రీవారివిషయమే గనుక, ఈ పునర్ముద్రణము, సందర్భశుద్ధిగలిగి సార్థకమేయయ్యె నని తలంచి, శ్రీ చంద్రమౌళీశ్వరుల ఔర్ధ్వదైహిక క్రియల పరిసమాప్తి నాటికి ముద్రణము ముగించి ప్రకటించుటయ్యెను.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు, 1920 సం. లో శ్రీ చంద్రమౌళీశ్వరులను ప్రప్రథమముగా దర్శించినప్పుడు రచించిన పద్యములుకూడ యిందు జేర్చితిని.

ఈ కృతి రచనా సందర్భమున వైదికబౌద్ధధర్మములలోని త్యాగప్రశస్తి ప్రశంసరాగా, వైదికధర్మములోని కథలెన్నో, బౌద్ధకథలకెక్కినవనియు, త్యాగము సర్వధర్మములందు సమానముగా ప్రశంసింపబడెననియు, శ్రీవారికి శ్రుతపరచి, అందుకు మచ్చుగా నీ కథను శ్రీ శాస్త్రిగారు రచించి వినిపించిరి. ఈ కథ భారతమునందు ప్రసిద్ధమైనటులనే, బౌద్ధజాతక కథలందును 'కపోత జాతక' మని ప్రసిద్ధమైయున్నది.

ముక్త్యాల
10-3-1956

ప్రకాశకుడు
(డా॥ వేటూరి శంకరశాస్త్రిగారు)

## ఆశీస్సు

శ్లో॥ శ్రీమన్ కమ్మకులాంబుధి
చంద్ర! శ్రీచంద్రమౌళినృపమౌళే
సత్త్వ మధురస్వభావ
స్వాశ్రిత దీనార్థి విబుధకల్పతరో!

శ్లో॥ శ్రీరస్తు స్వస్త్యస్తు
క్షేమోస్త్వత్యంత సంప్రమోదోస్తు
సంకల్పసిద్ధిరస్తు సు
సంతాన సమృద్ధిరస్తు తే నృపతే!

మ. భగవంతుండు కలండు, పుణ్యమును
బాపం బున్న, దీలాటికా
ర్యగతుల్, పుణ్యమొసంగు,
నిట్టివియుఁబాపాపాదకంబుల్, నరుం
డు గణింపన్ వలె వీని, ధర్మపథమం
దుంబోవలెన్, శ్రేయమం
దుఁ గుదుర్కో వలె, నంచునెంచు
ధరణీంద్రుంగాంచి మోదించితిన్.

మ. క్షమ యత్యద్భుతమౌట యాశ్రితులక
ష్టంబుల్ సుఖంబుల్ సదా
తమవే యంచుఁదలంచు, టెల్లర దయా
దాక్షిణ్యముల్ కన్నులన్
జెమరింపం గనుఁగొంట భోగములతోఁ
జీకాకు గాకుంట నా
కమితానందము గూర్చె మీకడనె యా
హా చంద్రమౌళిప్రభూ!

ఉ. భారతవర్ష వైభవము భగ్నమొనర్చెడు నన్యధర్మసం
స్కారుల కాలమం దిపుడు కర్మఠులై పరమార్థచిత్తులై
యారసి సర్వవిద్యల రహస్యములన్ గ్రహియింప గోరు వి
ద్యారసికుల్ ధరాధిపతు లబ్బితి రిందుల కబ్బమందితిన్. (వే. ప్ర)

# తొలిపలుకు

(ప్రథమ ముద్రణమున)

శ్రీముక్త్యాల సంస్థానాధీశ్వరులగు వాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వర ప్రసాదబహద్దరువా రీవత్సరమున మహావైభవముతో జరిపిన బ్రహ్మానందోత్సవ సందర్భమున సమ్మానార్థమై యరుదెంచిన విద్వత్కవు లీలుబ్ధక కపోతోపాఖ్యానమును శ్రీవారినిదేశమున రచించుచుండఁగా నక్కడనుండి నేనును, నలవోకకై మూఁడుపూటలలో నిట్లిది ముగియ రచించితిని. తొందరగా రచించుటే పరమార్థముగాఁ జూచుకొనుటచే నిందు కవితాగౌరవము గానరాక పోవచ్చును. నా రచన మెట్లున్నను భారతమందీ కథ ప్రఖ్యాత మైనది. తిక్కనసోమయాజుల తెలుఁగురచనమే దీని కాధారము. సంస్కృతగ్రంథము నప్పుడు నేను జూడలేదు.

ఆర్తరక్షణార్థమై యాత్మత్యాగము చేయువారి మహోత్కృష్ట ప్రాభవమును, అట్టివారి నడవడి కెట్టికఱకుఱాగుండెవానిఁగూడఁ గఱఁగించి సద్వర్తనుఁ గావింప గాఁగల సామర్థ్యమును. నీ కథ ప్రతిపాదించుచున్నది.

ఆశ్రితవాత్సల్యము, దయ, ధర్మము, దైవభక్తి మొదలగు సుగుణములకుఁ దానకమైన శ్రీ చంద్రమౌళిక్షమాపాలురకు అలవోకగా రచించిన యీ యలఁతికృతి నుపాయనముగా నొసఁగుచున్నాఁడను. ఇ ట్లాశీర్వదించుచున్నాఁడను.

గీ. పుణ్యకీర్తితో సుపుత్రసుపుత్రికా
వృద్ధితోడ నిష్టసిద్ధితోడ
పెక్కువత్సరములు చక్కఁగా శ్రీ చంద్ర
మౌళివిభుఁడు రాజ్యమేలుఁ గాక!

చెన్నపురి,
20-11-25. వేటూరి ప్రభాకరశాస్త్రి

## కపోతకథ

శ్రీనిరంతరానంద నిశ్శ్రేయసార్థ
సాధకము సర్వకిల్బిషబాధకము స
మగ్రవిజ్ఞానదము మహామహిమఘనము
శరణమగు మాకు సద్గురుచరణయుగము. 1

క. గురుచరణమ్ములకు నమ
స్కరణ మ్మొనరించి కవనకౌశల మొప్పన్
విరచించెద నొకగబ్బము
శరణాగతరక్షణ ప్రశంసాపరమున్. 2

క. త్రోవరిపిండు ముదంపడ
నీవరి ప్రాసంగు దొట్టి నెఱిగల సస్య
శ్రీ వరియించినదై గో
దావరి దరితెలుఁగుసీమ తనరారుఁ గదా! 3

శా. ఆ గోదావరితీరమందు నొక రా
జ్యం బిప్పు డొప్పారు ల
క్ష్మీగేహం బనునట్టు, లందుఁ బ్రభువుల్
చెన్నారు చున్నారు స
ద్యోగుల్ భోగులు ధర్మతత్పరులు ధీ
రోదాత్తు లత్యుత్తముల్
ఱాఁగల్ గాక ప్రజల్ విధేయు లయి యా
రాధింతు రాభూపులన్. 4

ఉ. తాతల నాఁట నుండి బహు
ధర్మపరాయణు లై చెలంగు నా
భూతల నాథులం దిపుడు
పాల్చు నృపాలకుఁ డుత్తమోత్తమ
ఖ్యాతి గడించెఁ బోష్య జన

కల్పక మంచును బుణ్యకార్య చ
ర్యాతతబుద్ధియంచు శర
ణాగతరక్షకుఁ డంచు నెల్లెడన్. 5

ఉ. పొంగఁడు రాజ్యవైభవముఁ
బొందితి నంచును బాపచింతకున్
లొంగఁడు సంప దభ్యుదయ
లోలుపతన్ వెత లందఁ డెన్నఁడున్
గ్రుంగఁడు రాజ్యనిర్వహణ
రూపభరంబును మోయుపట్టునన్
భంగ మెఱుంగనట్టి నర
పాలురు తత్సము లెందు నుందురే. 6

శా. ఆదాయమ్మును మించునట్టివ్యయ మ
త్యాసన్నమై యుండ నే
దేదో సల్పుచునుండు నెల్లపుడు స
త్కృత్యంబు నత్యుత్త మా
హ్లాదం బందుచునుండు రాజ్య సుఖమం
దాసక్తుఁడుం గాఁడు తాఁ
దాదాత్మ్యంబున నొప్పు నెప్పుడు సము
ద్యద్ధర్మ కర్మాప్తితోన్. 7

సీ. తనమాట జవదాఁట కనయమ్ము వినయమ్ము
గల్గి కొల్చెడు కులకాంతవలన
తనయిచ్ఛకును నచ్చఁ దగునట్లు పనిపాట్లు
జరుపుచుండెడు భృత్యసమితివలన
తనకూర్మికిని నోర్మికిని మెచ్చి చన విచ్చి
వేడ్కఁగూర్చెడు బంధువితతివలన
తన యుత్తమ సువృత్తమును జూచి కడు నొచి
తిని జీవితముఁ బుచ్చు జనమువలన

భూమిపాలన వ్యాపారభూరిభరము
సర్వ మలవోకవోలెను నిర్వహింపఁ
దగినదై యుండె నా మహీదయితునకును
దాన డెంద మధ్యాత్మతత్త్వమునఁ దగిలె. 8

సీ. వేలకువేలుగా వెచ్చ పెట్టుచునుండు
బడులకంచును వేల్పుగుడులకంచు
మితిలేని ధనమిచ్చి మెచ్చించు సత్కవి
నాయకులను మంచి గాయకులను
ఎంతసొమ్మైనఁ దానేయిచ్చు బహుజప
మంత్రమ్ములకు యజ్ఞతంత్రములకు
వేఁడినదెల్ల మా రాడకుండ నొసంగు
నార్తులకును బుణ్యమూర్తులకును
మంత్రులును బందుగులు నతిమానమైన
వ్యయముఁ దలఁచియు నృపు సత్త్వభావమునకు
లోఁగియుండి మారాడకమూఁగలయిరి
వెచ్చపెట్టు టంతంతకు హెచ్చఁజొచ్చె. 9

ఉ. బాల్యమునుండి యాతనికిఁ
బ్రాణసఖుండుగ నుండువాఁడు సౌ
శీల్యము గల్గువాఁ డొకఁడు
చేరి నృపోత్తమ! రాజ్యమందుఁ బ్రా
బల్యముఁ గూర్పకుంట తగ
వా! మిముఁ బోంట్లకు! సర్వలోక వా
త్సల్యమునే జపించెదవు
సంపద పెంపునుగూడఁ జూడవో! 10

క. శరణాగతరక్షణ మది
సరి గాదనఁగాదు గాని సర్వస్వము త
త్పరతనె వెచ్చించుట మతి
సరిగా దనఁగా నొకింత సాహసి నగుదున్. 11

శా. దండన్ బండితులున్ గవుల్ గథకులున్
దత్త్వజ్ఞులున్ యాచకుల్
మెండై యుండుట మెచ్చఁగాఁ దగినదే
మిత్రోత్తమా! యాయపుం
బండాలమ్మును జూచుకొంచు వ్యయముం
బాటింపఁగాఁ జెల్లు శ్రీ
భాండాగారము పెంపు నింపవలదే
పల్మారు భూపాలకుల్. 12

క. అడిగినవారల కెల్లన్
విడఁబడి యీయంగఁదగునె విబుధాచలమున్
బొడ వడఁగదె బహుయాచక
విడంబనముచేత, నెఱుఁగవే మది నిదియున్. 13

గీ. అనుడు నా భూమిపతి సుస్మితాస్యుఁ డగుచు
దన యనుంగు భుజంబుపైఁ దాఁకి యిట్లు
చెప్పఁగాఁ బూనె; నెయ్యుఁడా! తప్పఁదలఁచి
నాఁడ వొక్కింత నాపల్కుజాడ వినుమ! 14

క. అజ్ఞానుఁడనై రాజ్య మ
వజ్ఞాపాత్రమగు నన్నభయ మెఱుఁగక నే
యజ్ఞములని వ్రతములని యు
పజ్ఞారహితముగఁ జేయ వాంఛించితినే! 15

వ. ఎఱుఁగవుగాక నీ కొక్కరహస్యం బెఱిఁగించెద వినుము. 16

ఉ. మందులవంటి ధర్మముల
మర్మములన్ బహు సత్కథా సుధా
స్యందమునందుఁ జొన్పి మును
శాంతనవుం డల ధర్మరాజు కో
రం; దను వంపసెజ్జపయి
రాల్పడుచున్నను శాంతచిత్తుఁడై

విందులు వెట్టినట్టు రస
విస్ఫురణంబునఁ జెప్పె నొప్పుగాన్. 17

ఉ. అంచిత ధర్మ నిర్మల ర
హస్యము లెయ్యవి ధర్మరాజుతోఁ
గొంచక చెప్పె భీష్ముఁ డవి
గొప్పగ విప్పుగఁ జేసి వ్యాసుఁ డా
పంచమవేదమై వెలయు
భారతమం దల శాంతిపర్వమం
దుంచి రచించె నందుఁ గల
దొక్క కథానక మేను జెప్పెదన్. 18

గీ. సరసచతురబుద్ధి శాంతనవునివంటి
ధర్మవేత్త మత్పితామహుండు
బాల్యమందు నన్నుఁ బఠియింపఁజేసె నా
సర్వకథలు శాంతిపర్వమందు. 19

గీ. సర్వసమయములందు నా శాంతిపర్వ
కథలె మెదలుచునుండు నా కడుపులోన
ఏపనిని జేయఁబూనిన నెపుడు నాకు
నాకథలె ధర్మనిర్ణయ మాచరించు. 20

వ. అని యాప్రభూత్తముండు శాంతిపర్వగతమగు కతనొక దాని ని
ట్లాతనికి వినిపింపందొడంగె. 21

సీ. కానల కేఁగి మృగవ్యూహములఁ బక్షి
గణములఁ జాల మారణ మొనర్చి
కణఁకతో వాని బట్టణములయందు వి
క్రయ మొనర్చి ధనంబు గణనచేసి
చేయుచునుండెను జీవయాత్ర నొకండు
బోయండు; వాఁ డొక్క ప్రొద్దు పెద్ద
సన్నాహమున వేఁట సాఁగింపఁగాఁ గాన
నంబునకును బయనంబు చేసె

జాగిలంబులు వలలును డేగ లుచ్చు
లురులు జిగురుఁగండెలు పెక్కుదెఱఁగు లయిన
సాధనంబులు గైకొని సాయ మన్యుఁ
డొక్కరుండును లేకయే యుక్కుమిగిలి. 22

వ. అక్కడ. 23

చ. ఉరులిడె మాట్లు వెట్టె వల
లొగ్గను డేగల నాకసంబునం
బఱపెను గుక్కజట్టుఁ బసి
పట్టగ విడ్చెను, బెక్కుయత్నముల్
జరిపెను గొన్నితోయముల
జంతువులన్ గ్రహియించె నంత నీ
శ్వరకరుణాతిరేకము వ
శంబుననో పెనుమార్పు లేర్పడెన్. 24

చ. చెరచెర సూర్యరశ్మి కడుఁ
జెమ్మట లూరఁగఁజేసె వాయుసం
చరణము లేకపోయెఁ బెను
సంకటమయ్యెను భూతకోటికిన్
సరిగ నొకింతసే పదియు
సైఁచుట బోయకుఁగూడ నెంతొ దు
ష్కర మనిపించె నాకసము
చాయ వెసన్ వెసఁ గ్రొత్త లేర్పడెన్. 25

చ. చిటచిటలాడు నత్తఱిని
జేఁదు మచ్చుగ నుత్తరంబు ది
క్తటమున మబ్బు గానఁబడెఁ
దత్క్షణమే యది చేఁటయంతగా
స్ఫుటముగఁ దోఁచె నంతఁ బది
మూలల నాకసమెల్ల నచ్చట

చ్చుటఁ జిఱు పెద్ద తున్కలయి
సాఁగెను మూఁగెను బెద్దమబ్బుగాన్. 26

శా. ఉక్కం గ్రుక్కలు ద్రిప్పుకోఁ గుదుర కెం
తో కష్టమైయున్న పే
రిక్కట్టున్ దొలఁగింపఁ గార్మొయిళు లెం
తే నంబరాంతంబులన్
నెక్కోఁగాఁ జలచల్లనై సుఖదమై
నిండారి మెండారి యా
చక్కిన్ వాయువు వీవఁగాఁ దొడఁగె దు
స్తాపంబుఁ జల్లార్చుచున్. 27

ఉ. వీచెను హొరుగాలి వన
వీథుల నిండిన పండుటాకులున్
లేచె నభస్స్థలంబును మ
లీమసమయ్యెను ధూళి రేఁగఁగాఁ
గాచిన వృక్షకాండములు
గాయలు పండులు రాల్చెఁ బక్షులున్
గీచురటంచుఁ గూయఁదొడఁ
గెన్ మృగముల్ చెలరేఁగె నత్తఱిన్. 28

చ. చిటపటమంచుఁ బెద్దపెద
చిన్కులు రాలఁ దొడంగెఁ గాఱు గ్ర
మ్ముట యధికంబు గాఁదొడఁగె
భూమియు నాకస మన్న భేద మం
తటఁ గనరాకపోయెఁ జకి
తద్యుతితోఁ జెలరేఁగె మించులున్
బెటిలు పెటిల్లు మంచుఁ బెను
పిడుగులు రాలెను మిక్కుటంబుగాన్. 29

సీ. భూమిభాగము జలప్లుతమయ్యె నభమెల్ల
గాఢాంధకారమ్ము గ్రమ్ముకొనియె

అంతరిక్షము భూమి సంతరించెడుమాడ్కి
    సంతతధారగా సాఁగె వృష్టి
హొరానుమ్రోఁత నిండారెను మిఙ్ఝను
    బల్లంబు నేకమై వెల్లివారె
చెలరేఁగె నీఁదురు చలి మిక్కుటంబయ్యె
    మృగములు ఖగములు బెగడఁదొడఁగె
తెఱపియేర్పడదయ్యె నత్తఱిని గఱకు
బోయ మదిగూడఁ గడుభయంబున మునింగె
అడవిలో నాతనికి నిల్వ నెడము గాన
రాకపోయెను బెద్దచీకాకు గదిరె. 30

గీ. అస్తమించెను సూర్యుండు కస్తిగూర్చు
వాన యెంతయు హెచ్చె నక్కానలోన
బోయఁ డాతండు మిత్తైన భూమిచాయఁ
జక్కనెదిగిన యొక వనస్పతిని దరిసె. 31

గీ. వందలకొలంది యేండ్లకు ముందుఁ బుట్టి
ప్రబలి జొంపముల్ గదిరి కన్పట్టుచున్న
యాధరాజముఁ జేరియావ్యాధుఁ డొదిగి
యుండె నాదండ నొక పెద్దబండమీఁద. 32

ఉ. "రాతిరియయ్యె నిత్తఱి ధ
    రాజముపై వసియించుచున్న యో
భూతములార! పెన్భయము
    పుట్టెడు నెట్టులు జీబుటిర్లలోఁ
సీతున నిల్తునో యిచట
    సేమ మొసంగి యనుగ్రహింపుఁడీ!
యాతురునిన్ ననున్ గరుణ
    నాపద లేవియుఁ జూపకుండఁగాన్." 33

వ. అని ప్రార్థించి యాబోయం డయ్యెడ నొదిగియుండె నప్పుడు. 34

ఉ. ఆ తరుకోటరాంతరము
నందు వసించు కపోత మొక్కఁడా
రాతిరివేళఁ బ్రేయసి తొ
అన్ దరియన్ జనుదేరకుండుటన్
జేతము భీతిపాలుపడి
చేడ్పడ నేడ్పున గొంతు రాల్పడన్
గూఁతలువెట్టెఁ బక్షులకుఁ
గూడ వియోగ మశక్యమేకదా! 35

"సీ. ఏల రాదయ్యెనో యిందాఁక నా సాధ్వి
గాఢాంధకారమ్ము గ్రమ్ముకొనియె
కూలెనో యెందేని గాలివానకుఁ. దాళఁ
జాల నయ్యెద నాదుతన్విఁ బాసి
కువకువలాడుచు గూఁటిలో నా ఱెక్క
చాటున శయనించు చానలేదె?
ననుఁబాసి తానెంత వనరుచున్నదియొకో
కటకటా! ప్రాణాన గలదొ లేదొ!
ఏమి సేయువాఁడ నెచట వెదకువాఁడ
నేమిచిక్కు నా కిఁకేమిదిక్కు
అదరుచుండె గుండె నిదురయు రాదయ్యె
నింపు మాలె నాదు కొంప గూలె. 36

సీ. ఎందున్నదానవో యెలనాఁగ నా యీ గ
తిం దలంతువొ లేదొ తెలియరాదు!
నాకుఁగా నీ వెంత యేఁకారుచుందువో
విందువో వినవొ నా విలపనంబు!
ఇల్లాల! నీవులే కీకోటరపుగూఁట
జేరి కాపుర మెట్లుచేయఁగలను!
జీవించి యెందైన నీవున్న దానవా
కానవా! నాదు దుఃఖంబు పెల్లు

ప్రేయసీ! యెందుఁబోతివే ప్రియునిఁబాసి
యోసి యర్ధాంగలక్ష్మి! యెట్లోర్తు నింక
సంకటమ్ముల సైరింపఁజాల భావి
జీవితము నాకు బరువయ్యెనే వధూటి!" 37

వ. అంచుఁ బలవించుచుండ. 38

గీ. బోయవలలోఁ దగుల్కొని పొగులుచున్న
యాఁడుపావుర మా పల్కుజాడలు విని
డెంద మానందమునఁ బొంది తందరింపఁ
దాను దనలోన నీ మాడ్కిఁ దలఁచుకొనియె. 39

ఉ. "నెమ్మది నా పయిం బ్రియము
నిండి మగండు మదీయ విప్రయో
గమ్ము సహింపజాలఁక పా
కాలుట వింటిని బుణ్యసాధ్వులం
దెమ్మెయిఁ బేరుగాంచితి బ
లే! బలె! భర్తకు నార్తిఁగూర్చు పెన్
కుమ్ములమారి పెండ్లముల
కుత్సితపుంగతి దప్పి యొప్పితిన్." 40

శా. ఆనందంబున నట్లు లోఁ దలఁచి యా
యాఁడుంబులుం గాడు "నో
హెూ! నా భాగ్యమ! జీవితేశ్వర! యిదే
యుంటిన్ వలం జిక్కితిన్
నీ నా నెయ్యము తియ్యముల్ ముగిసెఁ బో!
నేఁ డింక జంకాడినన్
గానన్ రాదు ప్రయోజనం, బె వనికౌఁ
గర్మంబుఁ దప్పింపఁగన్. 41

చ. ముసురున ముగ్గి యూల్గెనని
పొక్కకు మిక్కడ బోయవచ్చి పై

విసరె వలన్ దగుల్పడితి
వెల్వడిరా నిఁకరాదు గాన నా
యుసురునుగూర్చి యాసవిడు
మో యనుఁగుం జెలికాడ! నీ విటన్
వ్యసనము వీడి ధర్మపథ
మందుఁ జరించుట యంచితంబగున్. 42

ఉ. అదరుచు భూరుహాంతికము
నం దలబోయ వసించు చత్తునన్
బెదరున భూతకోటి నదె
పెల్లుగఁ బ్రార్థనసేయుచున్నవాఁ
డది వినియుందు వార్త శర
ణాగతుఁ బ్రోచుట ధర్మమౌట నో
సదయమతీ! వెతన్ విడిచి
సల్పుము వానికి సత్సహాయమున్. 43

క. ఒడలెల్లఁ దడిసె సీతున
గడగడ వడఁకాడుచుండెఁ గావలయున్ బో
యఁడు వానికి నేమేఁ దో
డ్పడుమా, యపకారబుద్ధిఁ బరికింపకుమా!" 44

వ. అనుటయు. 45

శా. ఆమాటల్ వినెఁ బూర్వజన్మకృతపు
ణ్యం బంత విప్పయ్యెనో
యేమో! యామగపావురంబు మదిలో
నింతేనిఁ జింతింపలే
దామర్త్యున్ బ్రబలాపకారకరణున్
బ్రార్థించె మర్త్యస్వర
వ్యామిశ్రంబుగఁ గంఠమెత్తి యిటు ధై
ర్యౌదార్యముల్ పేర్పడన్. 46

శా. "అన్నా! బోయఁడ! మా గృహంబునకు
నీ వభ్యాగతుం డైతి వే
నెన్నన్ బక్షిని, బావురంబను, గడున్
హీనుండ, నాహారమున్
దిన్నావో మఱి లేదో, యేదయిన నా
తిథ్యంబు గాంక్షింతువో,
యున్నాఁడన్ సమకూర్పఁగల్గినది యంతో
యింతో యర్పింపఁగన్. 47

క. "పక్షివి నీ విట్లు దయా
దాక్షిణ్యము లెఱుకుమీఁదఁ దాల్చెదె?" యని న
న్నాక్షేపింపకు బ్రదుక
న్నా, క్షణికము! ధర్మమేకదా స్థిర మరయన్" 48

మ. అనఁగా నాతఁడు సంప్రమోదభరితుం
డై యిట్లనున్ "బాపురే!"
యనఘా! పక్షివరేణ్య! నీ పలుకుల
త్యాశ్చర్యమై తోఁచె బో
యను నన్నింత యనుగ్రహింతె? చలిచే
నంగంబు మ్రోడయ్యె నీ
వనటన్ బాపఁగ నోపుదే నిచట
నిల్వన్నేర్తు నీరాతిరిన్. 49

వ. అనుటయు నప్పావురంబు తెక్కలు విదిర్చుకొని ప్రక్కనున్న పక్కనంబునకుంజని యక్కడ నొక్కెడఁ జిదుకుల మంటలో మండుచున్న పుల్లనొక్కదాని నిప్పుసల్లారకుండఁ గొనితెచ్చి యడవి యది తడిసియుండెఁ గావునఁ బొడిపుల్లల నెందును బొందఁజాలక కోటరాంతర్గత మగు తనకులాయమ్మును గూలఁద్రోసికొని యప్పుల్లల నెల్లఁ బ్రోవిడి నిప్పు రగిల్చి పెనుమంట దరికొల్పి యబ్బోయతో నిట్లనియె. 50

క. "వడవడ వడఁకుచు నుంటివి
కడుఁ జా గయ్యేంగదన్న! కాఱియపడఁ జా
ప్పడ దిఁక నగ్గి రగిల్చితి
నొడలెల్లం గాచుకొనుమ! యోపిక గనుమా!" 51

వ. అనుటయు: 52

ఉ. బోయఁడు నిప్పు చెంతకును
బోయి సుఖంబు నఖంపచంబు నా
ప్యాయన మైనమాడ్కిఁ దన
యంగములం గడకొల్పె వేఁడి నా
హా యని మెచ్చె హాయి గొనె
నంతట నాఁగఁగరాదొ యిస్సిరో!
హేయముగా మఱొండు జని
యించెను వాంఛిత మప్డు వానికిన్. 53

క. "పక్షీ, మంట రగిల్చితి
రక్షించితి వపును గాని రాఁజఁ దొడంగెన్
గుక్షిన్ క్షుధాగ్ని దీనిమ
హాక్షోభము నార్పువెరవు నరయఁగదన్నా ! 54

గీ. కొన్ని పిట్టలు వలఁ దగుల్కొనియెఁ గాని
వాని నిపుడు గుర్తింప నావశము గాదు
ఏచి వానతోఁ జలిగాలి వీచుకతనఁ
గటికచీకటి వనమెల్లఁ గ్రమ్ముకతన. 55

క. ఇంటికిని జేరఁగల నను
కొంటిని గాఁబట్టి తెచ్చుకొన నైతి నెదే
వంటక మిపు డెంతయు నా
కొంటినయో యిచట నిలువఁగూడక యుండెన్." 56

వ. అనుటయు నప్పావుర మిట్లనియె: 57

ఉ. "పక్షుల మమ్ము, మా యునికి
పట్లను మా గమనమ్ము నింక మా
కుక్షుల నించుకొ న్వెరవుఁ
గూరిచి చేరిచి భావిజీవితా
పేక్షను మేము దాఁచుకొను
విత్తమునున్ విభవంబు సర్వమున్
వీక్షణ సేయుచుందు గద
వే నిరతంబుఁ గిరాతకాగ్రణీ! 58

వ. అన్నా! నీకేమి యాహారంబుఁ దెచ్చి యీయఁ గల్గువాఁడ" ననుచు
విన్నందనమ్ముగదురఁ బలికి మనమ్మున నిట్లనుకొనియె. 59

చ. 'అతిథి హతాశుఁ డెవ్వనిగృ
హంబుననో; శరణార్థి చక్క ర
క్షితుఁడయి యొప్పఁడో యెవని
చే, నలవానిగృహంబు, భాగ్యమున్,
బ్రతుకును బాడుకొంపదివె
వంటివిగా వినియుంటి, నెట్టులే
నితని యభీప్సితంబు ఘటి
యింతును గాంతుఁ గృతార్థభావమున్.' 60

గీ. అస్థిరంబైన దేహంబు నప్పగించి
సుస్థిరంబైన పుణ్యంబు చూఱగొందు;
కాకిబంగారము నొసంగి గణ్యమైన
మేల్మిబంగారమును గొంట మేలుగాదె. 61

శా. "ఆత్మార్థం పృథివీం త్యజే" త్తనెడువా
క్యం బేమివాక్యంబొ! తా
రాత్మత్యాగమునన్ బరప్రియము సే
యం బూనువారే సుధ
న్యాత్ముల్, బోయకు నిప్ప డోయిరముగా
నంగమ్ము నర్పించి నే

నాత్మత్యాగసముద్భవాద్భుత సమా
హ్లాదాబ్ధిలోఁ దేలెదన్." 62

వ. అని తలపోసి, 63

శా. "ఏఁకారన్ బనిలేదు తెప్పఱిలు మో
యీ, బోయఁడా నా యొడల్
కైకొమ్మాఁకటిమంట తీఱుటకు నై
కన్గొమ్మిదే నీచమౌ
సేకాయ మ్మతిథిక్షుధార్తి నుడుపన్
వేల్తున్ జ్వలద్వహ్నిలో
నీ కిద్దాన నొకింత తృప్తియగునేన్
నే ధన్యతం గాంచెదన్." 64

చ. అని వచియించి యగ్గి దరి
యం జని చక్కఁ బ్రదక్షిణించి నె
మ్మనమున నించు కేని యను
మానమునొందక యాత్మదేహ మ
య్యనలమునందు వేల్చెఁ బులుఁ
గల్లది యారసి క్రూరచిత్తుఁ డ
య్యును బెనుచింతనాబ్ధిఁ బడి
యుక్కిరి బిక్కిరి యయ్యె బోయయున్. 65

ఉ. 'మానస మూఁచుచున్న దతి
మానుషమైనది దీనిచర్య యా
హా, నెన రిట్టిదింగలదె!
యద్దిర యిద్దియుఁ బక్షియే, ననున్
హీనుని దుశ్చరిత్రుఁ గరు
ణింప నకారణ మిట్లు రూపముం
బూనిన యీశ్వరుం డగును
బో! యిఁకఁ బెక్కుదలంపు లేటికిన్. 66

మ. చలికిం జచ్చుచునున్న నన్ను దయ
హెచ్చన్ వెచ్చఁగా మెచ్చగాఁ
జలిమంటన్ దరికొల్పి ప్రోచె నసువుల్
స్వస్థంబు లయ్యెంగదా!
తెలవాఱన్ మఱి చూచుకోఁదగదె భు
క్తింగూర్చి, యిస్సీ, యిసీ!
నిలువన్ లే కదిగూడ వేఁడి పడితిన్
నేఁ బాపకూపంబునన్. 67

గీ. పురుగులను దిని జీవించు పులుఁగునకును,
నెంతవిజ్ఞాన మబ్బె! నిస్సీ! మనుష్య
జన్మమెత్తియు ఱాగుండె చండి బండ
మొండి ముండకొడుక నైతి మోసపోతి. 68

ఉ. నీతులు పల్కు వారిల న
నేకులు తోఁతురు, వారిచేఁత లా
రీతులఁ జక్కఁగా ననుస
రించుట తోఁపదు; మేలు గల్గ దా
కోఁతలమార్గచే నొరుల
కున్, దగఁ దాము వచించుధర్మముల్
చేఁతల నిల్వరింతురు వి
శిష్టులు వారుగదా జగద్గురుల్! 69

గీ. కడఁగి యజ్ఞాన గాఢాంధకారమందుఁ
గొట్టుకాడుచునున్నా కిట్టె తోఁపఁ
జేసె విజ్ఞానపుంజ్యోతి చేఁతవలన,
నేమి పక్షియే యిది గురుస్వామి నాకు. 70

క. కోరిక లభింప నింకొక
కోరిక యదిగల్గ మఱొకకోరిక యది చే
కూరిన నింకొక టింకొక
టీరీతిం గోర్కు లెప్పు డెదుగును గదరా! 71

క. చీ! చీ! యిటువలెఁ బైపై
నే చెడుకోరికలపెల్లు నీక్షణమందే
రాచెద నిహాభిమానముఁ
బాచెదఁ ద్రోచెదను దుస్స్వభావము భవమున్." 72

వ. అంచు నైహికవాంఛాపరంపరలందు విరక్తుఁ డయ్యె నా వ్యాధుం
డప్పుడు, 73

సీ. బోయ డెందము మాయఁ బాయఁదన్నినయట్టు
లంధకారముఁ బాసె నాకసంబు
బోయచిత్తమునం బ్రబోధమ్ము వెలిఁగిన
ట్లలరారె నెల నభోభ్యంతరమున
బోయపాపము లుడివోయిన మాడ్కిఁగా
నిట్టట్టు వాననీ ర్వట్టిపోయె
బోయకు వైరాగ్యమును బోలె సుఖదమై
మందమారుతము వీవం దొడంగె

గీ. అడవి బెడఁగారె నందందు విడువఁబడిన,
పన్నఁబడిన జంతువు లురుల్ వలలు మొదలు
గాఁగలుగు సాధనంబులు గానఁబడియె,
బోయఁ డవియెల్ల నొకచోటఁ బ్రోవుచేసె. 74

ఉ. పట్టినపిట్టలన్ విడిచెఁ
బన్నిన యుర్లు వలల్ సడల్చెఁ దా
ముట్టినయట్టి తక్కు కొఱ
ముట్లను గుక్కల దేగలన్ విడెన్
బుట్టిన సుప్రబోధమున
మోహపుద్రోహపు టూహలెల్ల న
ట్టిట్టయి పాయఁగా నతఁడ
దే తలపోయుచు నుండునంతలోన్. 75

గీ. వలలు నురులు సడల్పఁగాఁ దొలఁగిచనిన
పక్షులును జంతువులు నున్కిపట్ల కరిగె,
నంతలో నక్కపోతపుఁ గాంతగూడ,
జీర్ణతరుకోటరమునకుఁ జేరవచ్చె. 76

వ. వచ్చి తన వల్లభుఁ డగ్నిలోఁ ద్రెళ్ళియుండుటఁ బొడగాంచి యిట్లని
యడలఁదొడఁగె. 77

సీ. "హానాథ! నీదు నెమ్మేనిలో సగపాలు
పయినుండ నగ్గిపా లయితి వెట్లు?
ప్రాణమ్ములెల్ల నీ పైఁ బెట్టుకొనియున్న
న న్నుజ్జగించి పో న్యాయ మగునె?
పతిఁ గోలుపోయి జీవితము వుచ్చుట సాధ్వి,
కతిదుస్సహంబని మతిఁ దలఁపవొ?
బోయ కోయిరమయి పోనున్న దను వగ,
రేఁగఁగా ననుఁ బల్కరింపవైతె?

గీ. క్రొత్తకల్గె బోయకు మది మెత్తనయ్యె
విడిచె నాకింకఁ బరతంత్రవృత్తి దొలఁగె
శోక మేమిటికో నాకు నీకుఁగూడ,
నొక్కటే పుణ్యలోకము దక్కుచుండ! 78

గీ. రాయివంటి కఱకుబోయని డెందము
కరఁగె నీవు మేను దొఱఁగు కతనఁ
దప్పెఁ బాపమృత్యు విప్పుడు నీయను,
గమనమునను బుణ్యగతిని గందు. 79

క. వల్లభ, వల్లభ, వల్లభ.
యిల్లాలిం గొంచునేఁగవే!" యను చగ్గిం
జల్లారకుండ రగిలిచి
త్రెళ్లెం దా నందు సత్సతీ ధర్మమునన్. 80

గీ. వచ్చె దేవవిమానంబు మెచ్చె వారి
నందుఁ గొనిపోయె దేవతా బృంద మపుడు
బోయఁ డక్కడ మిగుల నద్భుతము గదురఁ,
బ్రమసి కనుఁగొనెఁ బక్షిదంపతుల గతులు. 81

ఉ. నివ్వెఱ దోఁప నాతఁ డటె
నిల్చెను బక్షుల దివ్యవైభవం
బువ్విళులూరు చిత్తమున
నూహ యొనర్చెను జీవితేచ్ఛ దౌ
దవ్వులఁ బాఱఁదోలెఁ దన
త్రాళ్లు నురుల్ వల లింక వస్త్రముల్
క్రవ్వఁగఁ బేర్చెఁ గోటర ము
ఖంబున నిప్పు రగిల్చె గొప్పగన్. 82

ఉ. ఎండిన తొఱ్ఱముం దనల
మేచి రగుల్కొనె బోయఁ "డీశ్వరా!
దండము; నాదుపాపసము
దాయము హేయము మేనితోడనే
మండెడుఁగాత మీయనల
మధ్యమునం దిఁక జన్మబాధ లే
కుండెడుఁగాక నా"కనుచు
మాడ్చుకొనెన్ దను వమ్మహాగ్నిలోన్, 83

ఉ. దివ్యవిమాన మప్పు డరు
దెంచెను వచ్చిరి దేవదూతలున్
సువ్యవసాయతత్క్షణవి
శోధితచిత్తుఁ గిరాతకున్ విన
ష్టవ్యథుఁగొంచుఁ బోయిరి ప్ర
శంసిత వైభవమొప్ప నప్పుడే
యవ్యయమైన దివ్యపద
మందె నతం డది యెంతవింతయో! 84

వ. అని యిట్లు భారతప్రోక్తమగు కథానకము నప్పార్థివోత్తముండు విప్పి
చెప్పి, 85

ఉ. "వింటివె యీ కథావిధము
వీతిఁడినై యిహలోక భాగ్యపుం
బంటకు నంట కుంటినని
భావమునస్ దలపోయఁ బోకుమీ!
కంటిని గంటి నైహికవి
కారములెల్లను శాంతిధర్మముల్
వింటిని వింటి నిత్యసుఖ
వృద్ధిని బుద్ధిని నాసచేసితిన్. 86

ఉ. ఎవ్వఁడు ధర్మసక్తుఁ డయి
యీశ్వరతత్పరుఁడై స్వయత్నముల్
గవ్వకుఁగూడ మాఱవని
కన్గొని యార్తుల రక్షణార్థులన్
నెవ్వగనుండి కావఁ దన
నేర్పును, భాగ్యము, వెచ్చపెట్టునో
యవ్వరణీయ వర్తనుస
కబ్బెడు నిందును నందు సౌఖ్యముల్. 87

మ. ఇహలోక స్పృహతోడనే యుడుకు చే
దేదో మహాయాస మ
న్వహముం జెందుచుఁ బారలౌకికసుఖా
నందంబు నందంగ స
న్నహనం బించుకయేని చేయని యవి
జ్ఞానాత్మకుం డెయ్యెడన్
బహుళానర్థము లందుఁగాని సుఖముం
బ్రాపింపఁ డొక్కప్పుడున్." 88

క. అనుటయు నానెయ్యుం డి
ట్లనియె "బళారే, నృపోత్తమా! నీమాటల్

వినఁదగినవి మననము చే
యను దగినవి మెచ్చుకొంటి నౌనౌనంటిన్. 89

ఉ. భారతమందు నింక నర
పాలక ధర్మవిశేషముల్ మహో
దారముగా వచింపఁబడె
నయ్యవియున్ వినియుందురే కదా
యూరక వానిఁద్రోసి యిది
యొక్కటియే పరమార్థ మంచు మీ
రారయుచుందురేమి? మఱి
యన్నిటిఁ దిన్నఁగఁ జూడఁగూడదో!" 90

గీ. పుడమితేఁడు బుజముఁ బుడుకుచుఁ జెలికాని
తోడ ననియె స్మితము తొంగలింప
"అన్న! నీ హితోక్తి విన్నాఁడ దానిని
దీని నింక సంప్రతించువాఁడ." 91

క. అది మొదలుగ నానృపుఁడొ
క్క దెసన్ బరమార్థ మింకొకదెసన్ రాజ్యా
భ్యుదయార్థము సాధించుచుఁ,
బదిలముగా నిహపరార్థభాజనమయ్యెన్. 92

శా. శ్రీనిత్యోర్జిత వాసిరెడ్డికులజ
శ్రీచంద్రమౌళీశ్వర
క్ష్మానాథాశ్రితపండిత ప్రవర స
త్కారార్థ కావ్యార్థ సం
ధానాలోకనజాతకౌతుక సము
ద్యత్సూక్తి మత్ప్రోక్తమా
ఖ్యానంబియ్యది శాంతచిత్తులకు నా
హ్లాదంబు గల్పించుతన్. 93

## తొలిపలుకు

ఈనాటివి యీనాఁటివియుఁ గాఁ గథలఁ

గల్పించి చినచిన్న కృతులు రచింప నాకుఁ గోరిక కలదు. ఈ మూన్నాళ్ల ముచ్చట యాకోరిక చొప్పునఁగూరిచిన వానిలో నొక్కటి. ఓగోబాగో పరికించుటకు సహృదయు లున్నారు గదా యని సంతోషించుచున్నాఁడను.

చెన్నపురి.
(దుందుభిజ్యేష్ఠము) వేటూరి ప్రభాకరశాస్త్రి.

శ్రీగురుచరణం శరణమ్.

## మూనాళ్ల ముచ్చట

శా. క్రొవ్వుంజవ్వన ముబ్బుగుబ్బెతల ట
క్కుం డెక్కులం జిక్క కే
అవ్వన్ అట్టును లేక పైకొనిన లేఁ
బ్రాయంపుఁ బెంజీఁకటిన్
బువ్విల్కానికిఁ గీర్తివి త్తమును గో
ల్పో కార్య మర్యాదకున్
దవ్వ ల్గాక చరించు నంచితుల వృ
త్తం బెంతుఁ జిత్తంబునన్. 1

శా. ఆరంగూరిన కూరిమిం జెలఁగు భా
ర్యాభర్త లేతత్కథా
సారంబారసి మేలుగాంతురను ను
త్సాహంబునన్ నీతి నిం
డారంగల్గి యథార్థమైనయొక గా
థార్థంబు వాక్రువ్వఁగా
నారంభించితి నేనిదే సుకవితా
వ్యాహారపుం ధోరణిన్. 2

గీ. ఊరు పేరు చెప్ప టొప్ప దేతత్కథా
ధారులయిన తరుణదంపతులకు
నేఁటివారు తెల్గునాఁటివా రదిగాక
వారు గొప్పయింటివారు గాన. 3

గీ. చదువుకొన్నవాఁడు సంపన్నుఁ డుద్యోగ
శాలి భోగభాగ్య లాలసుండు
ఇంచుమించు ముప్ప దేండ్ల ప్రాయమ్మువాఁ
డీ కథాప్రసక్తుఁ డిల్లుతేఁడు. 4

గీ. అతని ధర్మపత్ని యతినాగరకురాలు
సుగుణవతియుఁ జాల సుందరాంగి
పెద్దయింటిబిడ్డ విద్దియనేర్చిన
దించుమించు వయసు నిర్వదేండ్లు 5

శా. ఆ ఱే డేం డ్లగునేమొ కాఁపురము సే
యన్ వచ్చి యాసాధ్వి య
ల్లారుంబెల్లపు బిడ్డలన్ గడుపు చ
ల్లంగాఁ గనెన్ మూఁగురన్
సౌరూప్యమ్మును సౌమనస్యమును స
త్సౌభాగ్యముం గల్గి చిం
తారాహిత్యమునన్ సుఖంపడుచు ను
న్నా రింత కాదంపతుల్. 6

ఉ. ఎల్లపుడున్ మనఃప్రియున
కింపుజనింపఁగ నామె వింతగా
నల్లిక లల్లు నున్ని గొని
యంచుల సంచులు గుట్టు మొల్లలన్
మల్లెలఁ గ్రొత్తక్రొత్తపువు
మాలలుగూర్చును గాని పూని తా
నిల్లలుకంగ మ్రుగ్గులిడ
నెంగిలులెత్త నెఱుంగ దెంతయున్. 7

గీ. ఉడుగు మాయమ్మ యొడ్డాణ మొత్తుకొనును
చేయుదువుగాని యత్తిల్లు చేరి యనుచుఁ
జేయనీ దయ్యెనఁట తల్లి చిన్ననాఁడు
పిన్నపుడు నేర కెటునేర్చుఁ బెద్దపెరిఁగి. 8

గీ. పెద్దయింటిబిడ్డ పిల్లలతల్లి య
టంచు మిగులఁ బ్రేముడించు వామె

నత్తయాడు బిడ్డ లొత్తిడి సేయరై
రింటిపనులఁ గూర్చి యింతదాఁక. 9

గీ. ఉన్నయూరు విడిచి యుద్యోగ వశమున
నుండి రివుడు క్రొత్తయూర వారు
అఁడుతోడు లేమి నామెయే యిట నిర్వ
హించుకొనఁగ వలసె నింటిపనులు. 10

గీ. అస్సురుస్సు రనుచు నతికష్టమున నింత
వండి పెట్టుటకె యవస్థపడుచుఁ
జేయఁజాలదయ్యె నాయమ్మ పను; లందు
నోపలేనితనముఁ దాపరించె. 11

క. బాలింతతనముతోడనె
సూలింతతనమ్ము వచ్చి సోలించుట ని
ల్లాలికిఁ బనితో డని నెల
కూలికి నొకదాసి పడుచుఁ గుదిరిచె నతఁడున్. 12

గీ. ఎల్లి దాని పేరు నల్లని చాయది
వయసు పదియునాఱు వత్సరములు
కూలినాలి చేసికొను చుండెడిది గాన
చిక్కనయిన మేని చెలువు గలది. 13

క. ఇల్లలికి ముగ్గువెట్టును
బిల్లల నెత్తుకొనుఁ బిండివిసరు నవి యివిన్
జిల్లరపను లొనరించును
బ్రల్లదమాడదు మెలంగు భయభక్తులతోన్. 14

ఉ. ఆలుమగందు ముచ్చటల
నాడు చొకానొక నాఁడు దాసితో
చీలిక వాలికై చెడిన
చింపిరిపాఁతను గట్టుకొంటివే

సీ లల! మంచి తైకయును
జీరయు నిత్తుము తాల్చుకొమ్మటం
చేలిన పేర్మితో నుడివి
యిచ్చిరి మెచ్చిరి దాని దాస్యమున్.

గీ. ఈవు మాయింటిలో వసియించునప్పు
డీ దురాకారమున నుండరాదు సుమ్ము
సొమ్ము లేకున్న నేమాయె శుభ్రమయిన
రవికయును జీర ధరియింపరా దటోసి! 16

క. తలదువ్వి కొనుము దినమున్
జలక మ్మాడుము మొగానఁ జాఁ దిడుకొనుమా
తెలిచీర తాల్చుకొనుమా
పులుగడిగిన ముత్తియంబుఁ బోలె మెలఁగుమా.

క. ఎల్లీ! ప్రాయపు దానవు
నల్లనిరూపమునఁజక్కనన్ గన్పడె దీ
తెల్లనిచీర ధరించిన
బల్లే! యొక గొప్పవాని భార్య వగుదువో. 18

గీ. అనుచు యజమానురాలు నెయ్యమునఁబలుకఁ
జీరఁగైకొని యెల్లి కొంచెముగ నవ్వె
కురులకంటెను నల్లనై యిరులు గ్రమ్మ
మోముపయి దంతకాంతులు ప్రామికొనఁగ. 19

చ. ఎడపక చెప్పినట్టి పను
లెల్లను జేయుచు నెల్ల వేళ ని
ల్వెడలక వారికిన్ ముదము
పెంచెను మిక్కిలి నక్కతంబునన్
వడుకని వస్త్రమున్ గలిగె
వండని యన్నము వారియింట న

ప్పడుచున, కంతకంత కెడఁ
బాసెను దొంటివికారవేషమున్. 20

సీ. తలయంటి తానును దలయంటికొను ధూప
మార్చి తానును ధూప మార్చికొనును
జడయల్లి తానును జడయల్లికొనుఁ బూలు
ముడిచి తానును బూలుముడిచికొనును
తెలివల్వయిడి తానుఁ దెలివల్వగొనుఁ జాఁదు
వెట్టితానును జాఁదు వెట్టుకొనును
కలప మ్మలఁది తానుఁ గలప మ్మలఁదికొను
విడె మిచ్చి తానును విడెముగొనును

గీ. ఇంటియజమానురాలి కేమేమిసేవ
సలుపు నదితాను నావల సలిపికొనును
మెచ్చి యిలుతేఁడు నిల్లాలు హెచ్చు కెచ్చు
చన వొసఁగి సొరుచక్కన సంతరింప. 21

ఉ. దొంగతనమ్ము లేదు పని
తొందరకున్ జిఱు బుస్సులాడ దు
ప్పొంగుచు వర్తిలున్ గడుసు
పోక లెఱుంగ దబద్ధమాడ దే
వం గలిగించు వేష మెడఁ
బాసె నటంచును దాసితీరు న
య్యంగన మెచ్చెఁగాని తటియం
గనదయ్యె మతేమియొచ్చెమున్. 22

గీ. తనకు దాస్యమ్ము నెఱపించుకొనుట తగును
తగునుగా కింక నితరకృత్యములఁ బనుపఁ,
బాయ కెప్పుడుఁదానయి చేయవలయు
భర్తృశుశ్రూషకును దాసిఁ బనుపఁదగునె!

ఉ. కట్టుకొనంగఁ జుట్టుకొనఁ
గాఁ బయి వై చికొనంగఁ బుట్టముల్
పెట్టియఁదీసి యిచ్చుఁ బని
వేళకు సున్నమురాచి యాకులం
జుట్టియొసంగు నేమడుగు
నో యది చేయున యిల్లుతేని కె
ప్పట్టున నేని దాసి యెడఁ
బాయఁగ రానిది యయ్యె నయ్యయో!

ఉ. తెల్లనిచీర దాల్చి సరి
దిద్దినపాపటఁ గొప్పు వెట్టి లో
మల్లెలుముడ్చి మాయయును
మర్మ మెఱుంగని నవ్వుమోముతో
నెల్లి దిన క్రమంబునను
హెచ్చుగ నూడిగ మాచరించుచున్
నల్లనిముద్దుగుమ్మయయి
నాటుకొనెన్ మది నిల్లుతేనికిన్. 25

శా. హృద్యాకారగుణాఢ్యయై తనకుఁ బే
ర్మిన్నించు నా లుండియున్
విద్యల్ నేర్చిన వాఁడటే నలుగురున్
బేరెర్గు నుద్యోగపుం
జోద్యమ్ముల్ గలవాఁడటే యతఁడొన
ర్చున్ యత్నమున్ నూత్నయో
షిద్యోగమ్మున, కంతఁజింతిలు యశ
శ్శ్రీహాని నూహించుచున్. 26

క. కులవిద్యా గౌరవ మొక
తల మన్మథదుర్విచేష్టిత మ్మొక తలయై
యెలయింప నతనిమతి యా
తల నాతలఁ దాఁకితాఁకి తకపిక లయ్యెన్. 27

గీ. దౌహృదముగాంచుఁ గా కేమి ధర్మపత్ని
చేకురును గాక యేమి య ట్లేకతంబు
బోధ మాభిజాత్యంబును బుగ్గిఁగలపి
యాసపడువాఁడె వాఁ డల్ల దాసిపొందు. 28

గీ. తిన్నగానుండు బుద్ధి కెదే వికార
మొదవెనే నది తనయంతఁ గుదుటఁబడదు
కీడు దానికిఁ దగినంత మూడి వంత
కూర్పవలయు నయ్యదిదాని మార్పవలయు. 29

ఉ. అల్లన పిల్చి చెక్కిళుల
నంగుళులన్ స్పృశియించి యోసి! నీ
నల్లన నాకు సోఁకె నని
నచ్చిక బుచ్చికలాడి యింకెవేఁ
జెల్లని చెయ్దముల్ సలిపి
సిగ్గుదలంపక యెగ్గెఱుంగ కా
ప్రల్లదుఁ డెల్లిచిత్తముఁ గ
రంచెను నించెను దుర్వికారమున్. 30

గీ. కనుల నోరచూపు గల్గె మై నును సిగ్గు
ప్రాఁకె నుడుల వక్రభావ మొదవె
ముద్దరాలి కెల్లి కద్దిరా మరుఁడు శి
క్షణమొనర్చె వలపు క్షణములోన. 31

గీ. తొంగి తొంగి చూచుచుం గొంకుచును ధర్మ
పత్ని రాక కులికిపడుచుఁ గాము
మాయ తెలివిమాల్చి చేయించుచెయిదమ్ము
లకు నతండు కడు విలక్షుఁ డయ్యె. 32

చ. అల యిలుతేని కప్పనుపు
టాలికిఁ జీటికిమాటి కేకతం

బులుఁ దెక తేర నవ్వు లల
　　వోకపిసాళము లిచ్చకంబులున్
మలినపుఁ జూడ్కులున్ మెతక
　　మాటలు మీఱుచు నాకులాంగనన్
నలినలి నంతకంతకు నొ
　　నర్చె వెసన్ వెస నాకులాంగనన్. 33

గీ. ఎల్లితోడ నెప్పు డేకాంతములు మీఱె
దానిసేవయు నతి మానమయ్యె
క్రోఁతివంటి దాసి కుత్సితాకృతిఁ బాసి
ముఱియుచున్న దేమి మూఁడెనొక్కొ! 34

గీ. అంచు సందేహకలుషితయయి సవసవ
మగనియళుకులు గుర్తించి దిగులుగాంచి
దాసిబెళుకులు పరికించి తత్తరించి
మఱుఁగుచుండిన యా యింటి మచ్చెకంటి. 35

గీ. కాంచుచుండెఁ బొంచిపొంచి గూఢమ్ముగా
వారిచాటుమాటు వర్తనములు
వారు నామెకన్ను వంచించి కేరింత
లాడ నదను వెదకులాడుచుండ. 36

మ. ఒకనాఁ డాయిలుతేఁడు సంజతఱి ను
　　ద్యోగ ప్రదేశంపుఁ గా
ర్యకలాపంబు ముగించి చిత్త మది దా
　　స్యాయత్తమై యీలువున్
గికురింపన్ ద్వర నిల్లు సేరి యట ప
　　త్నీ సన్నిధానంబులే
మికి సేబా సనుకొంచుఁ బొంచి యరసెన్
　　మిండర్కపుం బండువున్. 37

గీ. ఎచటికేఁగి రేమొ యిల్లాలుఁ బిల్లలు
నొంటికత్తె దాసి యింటిలోనఁ
గానవచ్చె డెంద మానందమునఁ బొందఁ
బెసరుఁబిండి చక్క విసరుచుండి. 38

సీ. చెమరువారిన మేనఁ గమియ నంటినదువ్వ
మంచిగందపుఁ బూఁతసంచునింప
బాహుకౌశల్య మొప్పఁగఁ ద్రిప్పు తఱి గల్లు
గల్లురంచును రంగుగాజు లులియ
వ్యాయామసుస్నిగ్ధ కాయసౌభాగ్యంబు
నలవోక యలఁతి యూర్పులును దెలువ
క్రొంగ్రొత్త తనకుఁ దార్కొన్న భోగోత్సాహ
మలరారు మొగము చిన్నెల నెలర్ప
గీ. తొల్లిటి వికారమెడఁ బాసి యెల్లి దాసి
తీగవారు నెలుంగుతో రాగరచనఁ
బాటపాడుచుఁ గూర్చుండి పీఁటమీఁదఁ
బిండివిసరంగఁ గన్నుల పండు వయ్యె. 39

గీ. ఎల్లి యవ్వానిఁ గన్గొని పిల్ల నగవు
కల్కి చూడ్కులు నునుసిగ్గు చిల్కరించెఁ
దీవరించెను దోడ్తోన పూవుటంప
పోటువాఁ డెంత తొందరపాటువాఁడొ! 40

చ. నిబిడములై పయింబయిని
నిల్వఁగ నీయక కాముబాణముల్
దబదబఁ జుర్కు చుర్కు మని
తాఁకి చికాకు ఘటింప నాతఁడున్
గుబగుబ డాయఁగా నరిగి
కుల్కు మిటారము గబ్బి నిబ్బరం
బుబుకుచునున్న యన్నెలఁత
నొత్తుకొనెన్ బిగియారు కౌఁగిటన్. 41

గీ. దిటవుగాఁ గౌగిలించి సందిట గదించి
యించుచవులూరు మోవిఁ జుంబించుటయును
మఱచె నాతండు తత్క్షణమాత్రలోన
మంచిచెడ్డలే కాదు ప్రపంచ మెల్ల. 42

క. ఈలీలఁ జాటు వెలువడి
కాలాగ్ని జ్వాల వోలెఁగని చనె నిల్లా
లాలింగనపుందమిఁ దన
యాలిం గనఁజాలఁడయ్యె నయ్యిలుతేఁడున్. 43

గీ. తత్తరిల్లి యెల్లి తరలె నత్తెఱఁగింత
గోచరింపఁ గన్నుఁగొలిపి తెలిపి
యిల్లుతేని మనము చెల్లాచెదరు లయ్యె
నచట నిలువఁ గాలు నాఁగదయ్యె. 44

చ. కడువడిమేనిపైఁ గలుగు
కంచుకముల్ సడలించి యయ్యెడన్
విడివడ పీడనాడి చనె
వీఱిఁడియై పురబాహ్య భూమికిన్
జెడఁబడి బుద్ధిగడ్డితిని
చేసినదోషము గోచరింపఁగా
బడిబడి ధర్మపత్ని మృదు
భావము భావమునం దలంచుచున్. 45

గీ. తగదు తగ దని యాతఁ డింతకును ముందు
బుద్ధి దుర్వృత్తి నుండి త్రిప్పుకొనఁజూచెఁ
దిరుగ దానాఁడు తృటిలోనఁదిరిగె నేఁడు
గుడిసెకట్టఁడు జడివానఁ దడిసికాని. 46

సీ. నెయ్యంపుఁదఱితీపు నిండారు నొకచూపు
వెలయదే యా జన్మవిభవమునకు
కరఁగి యైక్యానందగతినందు నొకపొందు
పొలదే యాజన్మ భోగమునకు

అమలిన ప్రేమామృతము లొల్కునొకపల్కు
పరగదే యాజన్మ భాగ్యమునకు
నెనరు పొంపిరిపోవ నొనరించునొకసేవ
చాలదే యాజన్మసౌఖ్యమునకు

గీ. హాయియైన యాజీవితస్థాయియైన
పుణ్యసంపాదకంబైన భోగభాగ్య
వాహిని గదన్న సద్ధర్మగేహిని యన
నేల బేలైతి నయ్యయో యెఱింగియెఱింగి. 47

సీ. సెలవివారదు గదా పలుమొగ్గలనుమీఱి
తీరు చెన్నారు చిన్నారినగవు
తొలఁకిపాఱదుగదా కులుకుడెందమునిండి
హాయి నాయిచ్చు నెయ్యంపుఁ బెంపు
గడప గాంచదుగదా పడుకమంచముమించి
యొప్పించి చెప్పు నాతప్పిదంబు
పెదవి ద్రొక్కదుగదా హృదయపేటిక దాఁటి
యేకతంబునను నాయేకతంబు

గీ. మాయయును మర్మమును లేక పాయ లేక
యేకతానమై యానందలోకమునకు
నంజెవేయించు నిల్లాలియరితి మాలి
కూలితిని దుర్వివేకాంధకూపమందు. 48

శా. కంపించున్ మన సిప్డు పెండ్లి తఱి సం
కల్పంబు "ధర్మప్రజా
సంపత్త్యర్థ" మటంచుఁజెప్పితిని దు
చ్ఛంబైన కామేచ్ఛ కై
దంపర్యమ్ము నిరాకరించు ఋషి తా
త్పర్యంబు గుర్తించియున్

దాంపత్యంపుఁబవిత్రతన్ జెఱిచితిన్
ధర్మ్యేతర ప్రక్రియన్.

చ. తలఁచిన సిగ్గుగూరు శప
ధంబుగ "నాతి చరామి" యంచునేఁ
బలికితిఁ బెండ్లినాఁడు హిత
బంధుగురుద్విజవహ్ని సన్నిధిన్
దెలిసియు నర్థమున్ నెఱపి
తిన్ దుద కిట్టు లనర్థ మయ్యయో
యలఘుతరార్థముల్ గద మ
హర్షి కృతంబులు గృహ్యధర్మముల్ 50

ఉ. క్షుద్రత్వంబున నన్నుఁ బోలెఁ దుద కె
గ్గో లగ్గొ యూహింపలే
కేద్రోహమ్మున కేనిఁ బాలుపడువా
రేకాంత మీ కార్య మం
చుద్రేకింతురు తగ్గ పన్నుగడ లె
న్నో పన్నుదుర్గాక స
ర్వద్రష్టన్ భగవంతుఁ గన్నుమలుపన్
వంచింప శక్యంబటే! 51

ఉ. ఇంచుక తత్తరిల్లి చని
యెన్ గనుగొల్పుచు దాసి, యాసడిన్
గాంచెనొ యేమొ యష్ణ కుల
కామిని యేమని నే నొర్చుదు
ర్వంచనఁ గప్పి చెప్పఁగల
వాఁడ నెటుల్ చనువాఁడ నింటికిన్
బెంచిక లయ్యెడున్ హృదయ
పేటిక నేఁటి కవజ్ఞ పైకొనెన్.

ఉ. వేల్పువలెన్ ననున్ గనుచు
వేఱు వచింపక నానిదేశపుం
బొల్పునఁ బొల్చు పత్నికిఁ గు
బుల్పుడు వాఁడను నేఁడు, కారణం
బల్పపుఁజెయ్ది చేయుటయె
యౌఁగద యుస్సిరో! బుద్ధివచ్చె నే
మెల్పున నిప్పు డింక విష
మించినకార్యము దిద్దుకొందునో! 53

ఉ. ఇంటికి నేను జేరు తఱి
కింతి యెటో చనియుండె నప్పుడే
తుంటరిచెయ్ది సల్పితిని
దోడనె దాసియుఁబాసి యేఁగె, లో
నంటినభీతిచేత నటు
లైనదిగా కులధర్మపత్ని క
న్గొంట కశక్య, మట్లయిన
గొప్పవిపద్దశ తప్పిన ట్లగున్. 54

చ. ఇటువలెఁ గొంత సేపటికి
నించుక ధైర్యపుఁ ద్రోవ తోఁపఁగా
దిటముఁ గుదుర్చుకొంచుఁ బఱ
తెంచె నతం డిలుసేర-నంతలో
నటువలె భర్త్రవజ్ఞ కను
లారఁ గనుంగొని తత్కళత్ర ము
త్కటమగుసంకట మ్మొదవఁ
గా నవగాహిత దుఃఖసింధువై. 55

ఉ. తత్తర మంది భర్త పెడ
దారినిబట్టుట దాసిమోమునన్

నెత్తురు లేకయుంట గమ
నించెను గాంచె నిఁకేమి యేమియో
తత్తదనర్థచేష్టితక
థాస్ఫుటచిహ్నితముల్ మనంబునం
దుత్తలపాటు మీఱ నొక
యోర వసించి తలంచె నీగతిన్. 56

మ. పొరపొచ్చెమ్ములు లేక యేకమయి యె
ప్డున్ బ్రేమవిస్రంభని
ర్భరతన్ వర్తిలు భర్త నాయెడల ధ
ర్మభ్రంశముం జేయు నం
చరయన్ జాలకపోయితిం గటకటా
యన్యాయ్యతాభీతికిన్
గరుణాస్ఫీతికి దూర మౌదురుగదా
కామాతురుల్ పూరుషుల్! 57

ఉ. కాంతల నమ్మరా దని తె
గంబడి పల్కుదు రెంతనిర్మల
స్వాంతలఁగూర్చి యేని విశ
యమ్మునె చెందుదు రన్యదీయ శు
ద్ధాంతరహస్యగోష్ఠి కురి
యార్తురు చిత్తము నాత్మదోషమున్
గొంతయినం దలంప రిదె
నూటికిఁ గోటికిఁ గానఁగాఁబడున్. 58

గీ. ప్రియము లొలుకు సతికిఁ బీడ కల్పించును
భర్త యొక్క చోటఁ బాపగతిని
ప్రియము లొలుకుపతికిఁ బీడకల్పించును
భార్య యొక్కచోటఁ బాపగతిని. 59

శా. కా కేమున్నది నేనె మందమతినై
కావించితిం దప్పిదం
బేకాలమ్మును భర్తృ దాస్యమును నే
నే యేల చేయంగరా
దాకుల్ పోఁకలు సైత మీయవలెనే
యాదాసి యెల్లప్డు క
న్నాకై చూచుచుఁగాచుకోవలయుఁ గా
దా భర్తృవాల్లభ్యమున్. 60

చ. ఎఱిఁగి యెఱింగి యింటిపను
లేయెడఁ జేయఁగఁ బ్రాలుమాలి య
క్కఱ నిరుపూఁట వండుటయె
కష్టముగాఁ బసుబిడ్డ లేడ్చు చోఁ
దఱి సరిదిద్దుకొంటకె వె
తంబడుచున్ బతినెమ్మి నమ్మి యే
మఱి మఱి చూఱవిడ్చితిని
మానము ప్రాణము దాసిముండకున్. 61

శా. ఏ వేవో యిటులే విచారములు పే
డెత్తన్ మనంబందుఁ గో
పావేశమ్మును దుఃఖభారమును నే
కాకారమై మోమునన్
వైవర్ణ్యమ్ము ఘటింపఁగాఁ జిఱుతసం
తానంబు పై వ్రాలి త
ద్భావోద్రేకము మాన్ప వంతఁబడుకాం
తన్ భర్త చేరం జనెన్. 62

క. అల్లన చేరంజని పసుఁ
బిల్లల ముద్దాడు నెపముపెట్టి సడిచనన్
జల్లఁగ నల్లికబెల్లిక
సల్లాప ముపక్రమించె సాధ్వీమణితోన్. 63

గీ. చెంతఁ జేరెడుమగనికిఁ గొంతయెడము
కలుగ నామానినియు నంత తొలఁగ నేఁగి
యిచ్చకమ్ములు ములుకులై యుచ్చిపాఱ
నదరు డెందమ్ముతోడ మాటాడె నిట్లు. 64

ఉ. ఎల్లిద మైతినే యకట!
యేటికిఁ జీటక మింకఁ జాలు న
న్నల్లరిపాలు సేయవల
దన్నిటి కున్నది వన్నెలాఁడి మీ
వల్లభురాలు నా - నవల
వాకొననీయక యాకగొల్పుచున్
బెల్లుగ నుప్పతిల్లె నొక
పెట్టన నెట్టన కోపతాపముల్. 65

మ. క్షణ మర్ధక్షణ మట్లు కోపభర ము
చ్చైస్స్థానముం జెంది వాః
కణముల్ కన్నుల నించుచుం బ్రబలశో
కంబై వెసన్ మాఱెఁ బై
క. నయభయము లొదవ నాసా
ధ్వి యిటుల్ పలుకంగ నతఁడు పెర పెరయై పై
పయిబిగువున సెనగలుతిని
చెయిగడిగెడుచేష్టఁ దోఁపఁజేయు చిటు లనున్.

ఉ. సుందరి! యోపలే కసురు
సు ర్మనుచుందువు చేయనేర వం
చుం దఱితో నెదేని పని
చొప్పును జెప్పుదు దాసి, కింతకే
సందియ మంది డెందము వి
చారపరంపర కప్పగించితే
యెందును సంశయాకులిత
లేగద భర్తలఁగూర్చి భామినుల్! 73

గీ. అంచు నాతండు తనుఁ దుటారించుటయును
దీర్చెదను లెండు మీకు సందేహ మనుచు
దూర మరిగినదాసిని జేరఁబిలిచి
చూచి దాచినమగనికంచుకముఁ దెచ్చి. 74

ఉ. కల్లరిసంశయమ్ములను
గాంతురు కాంతలుగా యటంచు నాన్
బల్లిదురాలు చేఁ దెఱచి
పట్టి మగండును దాసి చూడఁగా
నల్లని వారవాణముఁ గ
నంబఱిచెన్ గనవచ్చె దానిపై
నెల్లికవుంగిలింపుతని
యింపున నంటిన పిండిముద్రయున్. 75

క. నల్లనికంచుకముపయిన్
దెల్లని యా పెసరుఁ బిండి తెఱఁ గెఱిఁగించెన్
దెల్లముగ నంగుళులతో
నెల్లికరద్వయపుముద్ర నిరుపార్శ్వములన్. 76

గీ. బూకరింపఁ జూచెనో కాక యెటులేనిఁ
దొలుత నాగ్రహించుమెలుత నతఁడు
కంచుకంబు నెత్తి కాన్పించుపయి నెత్తి
గోఁకికొను, మతేమి వాకొనండు. 77

గీ. భయము సిగ్గు కొండలయి పయికొనఁ డిల్ల
వడినయెల్లి నల్ల వనిత చూచి
యేకువోలెఁ జేరి మేకైతివే యోసి
దాసి! చాలుఁజాలుఁ దరలు మనియె. 78

గీ. కూడుగుడ్డయిచ్చి నాడెంపు వేషంబు
దిద్ది యాదరించితిని గదోసి!

నెత్తి కెక్కి నేఁడు తొత్తైతి దొరసాని
వద్దిరమ్మ! నల్లముద్దుగుమ్మ! 79

క. ఈపగిది సాధునిష్ఠుర
తాపాటవ మొప్పఁ గొంతతడ వటు దాసిన్
శాపించియు నామానిని
కోపోద్రేకంబు నాపుకొనలేనిదియై. 80

క. తిండికి లే కిట వరవుడ
ముండి బలిసి మరులు రేఁగి యొగి నిలుతేనిం
బెండిలియాడఁ దలంచితె
ముండా! యనితిట్టెఁ బ్రాఁతముచ్చెం గొట్టెన్. 81

గీ. దాసిఁ దొలఁగఁ ద్రోచి తఱితో మగనిఁజూచి
కోపభరము నువిద తేపుకొనుచు
దాఁపరించితినిగదా! యయో! మీ ముద్దు
మురిపములను గొంత చెఱుపఁగాను. 82

క. కోపోద్రేకమున దురా
లాపము లాడితిని మీవలఁపునెలఁత నయో!
పాపము వచ్చె క్షమింపుం
డీ పాట ననుగ్రహింపుఁడీ యీ నన్నున్. 83

క. మీ పసుఁబాపలు గల రే
మీ పోషించుకొనలేరె? యేటి కిచట నీ
పాపాత్మురాలు? గోయో
కూపమొ చూచుకొను; మీకుఁ గోర్కి ససిపడున్

గీ. విన్నవించె నిట్లు కన్నీరు జారఁగా
నేడ్పుతోడఁ గేలుమోడ్పుతోడఁ
దప్పు సైఁపు మనుచుఁ దఱతఱలాడుచు
నిల్లుతేఁడు ననునయింపఁదొడఁగె. 85

వ. అత్తతిని 86

ఉ. ఏడవకమ్మ! యేడువకె
యెత్తుకొనంగదె యంచుఁ దల్లి వెం
టాడుచుఁ జీరకొంగుగొని
యశ్రులు తుడ్చుచు నేడిపించుచు
న్నాఁడవు నేఁడు మాయమను
నాయన! పో పొద మంచు దూఱుచున్
వీడనిసిగ్గు గూర్చెఁ దొలి
బిడ్డఁడు తండ్రికిఁ దల్లిచెంగటన్, 87

వ. రెండవ నిసుంగును. 88

క. ఆఁకలె యమ్మా! యా కలె
నా కన్నము పెట్టరావె! నాన్నా రా! యం
చేకీభావముఁ గూర్చెను
గోఁక చెఱం గీడ్చు చమ్మకు న్నాయనకున్. 89

ఉ. అరయ నాల్మగల్ల హృద
యంబు లనంబడు రెండు రజ్జువుల్
కూరిమియన్ పురిం బెనఁగి
కూడి యభేదమునన్ రహింపఁగాఁ
బేరిన పెంపు దేన నిఁక
వేర్పడకుండఁగ నేర్పడున్ సుతా
కారపుముళ్లు, ముళ్లటె య
ఖండసుఖోదయమూలకందముల్. 90

మత్త. గూనివీఁపును దెబ్బనోర్ మిడి
గ్రుడ్లు వ్రేలెడుదౌడలున్
బానకడ్పును నర్వదేండ్లకుఁ
బై వయస్సును గల్గి క

న్గో నసహ్యాతఁ దోపఁజేయు చొ
కొర్తు తిర్గలి చెంగటన్
గానవచ్చెను దాసి యామఱు
నాఁట నాయిలుఁతేనికిన్. 91

మూన్నాళ్ల ముచ్చట ముగిసినది.

మ. పస పేమే యన ముద్దరా లొకతెయు
ద్వాహంబు నా కంచు సం
తసపా టెల్లను వెల్లడించెనట మూ
న్నాళ్లేఁగునామీఁద నీ
ముసుఁ గేమే యన నింటియాతఁ డయయో
పోయెం గదా యంచు వె
క్కసపుందుఃఖము వెల్లడించెనట యీ
గాథార్థ మట్లేకదా! 92

------------------



